# చైర్మన్‌తో ముఖాముఖి



నూకారపు సూర్యప్రకాశరావు
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

ప్ర: మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత పన్ను వసూలుదారుల దాడులు మూడు రెట్లు పెరిగిపోయాయి. రెండులక్షల రూపాయలకు మించిన విలువైన వస్తువుల కొనుగోళ్ళకు నగదు రూపేణా చెల్లింపులు చేస్తుంటే చెల్లింపులు చేస్తున్న చోటే 1 శాతం పన్ను వసూలు చేస్తున్నారు. నిజాయితీపరులు పన్ను చెల్లిస్తుండగా అక్రమార్జనపరులు మాత్రం పన్నులు ఎగవేస్తున్నారు. ఇది ఇలా కొనసాగాల్సిందేనా? నల్లధనం అరికట్టడానికి ఏం చర్యలు తీసుకోవాలి?

–వి.మనోహర్, ఏలూరు

జ: ఈ కొత్త చెల్లింపుల విధానం గత జూన్ 1 నుంచి అమలులోకి వచ్చింది. పన్నుల ఎగవేతదారులపై కఠినచర్యలు తీసుకోవాలని పన్నులశాఖను ప్రభుత్వం ఆదేశించింది. దేశ ఆర్థిక వ్యవస్థ నుంచి నల్లధనాన్ని ప్రక్షాళన చేసేందుకే ప్రభుత్వం ఈ కఠిన చర్యలు చేపడుతోంది. ఇవి పూర్తిగా స్వాగతించాల్సిన చర్యలు. నల్లధనం అనేది నిజాయితీపై పన్ను కదా. నిజాయితీపరులు పన్ను చెల్లిస్తుండగా అక్రమార్జనపరులు పన్నులు ఎగవేస్తున్నారు. పన్నులు సకాలంలో చెల్లించకపోతే కఠిన చర్యలు అనివార్యమని లిఖితపూర్వకంగా హెచ్చరికలు పంపడం పన్ను చెల్లింపులలో మెరుగుదలకు దారితీసిందని ఇజ్రాయెల్‌లో ఒక అధ్యయనం వెల్లడించింది. మన దేశ ఆర్థికవ్యవస్థలో నల్లధనానికి తావులేకుండా చేయడానికి మోడీ ప్రభుత్వం కఠిన చర్యలు చేపట్టడానికి పూనుకోవడం పాలకులు సరైన దిశలోనే ముందుకు వెళుతున్నారనే భరోసాను కల్పిస్తోంది. నల్లధనం ప్రక్షాళనకు చేపడుతోన్న చర్యలు పన్నుల ప్రభా వాత్మక రేటును పెంచుతాయి. నల్లధనం ప్రక్షాళన చర్యలలో, పన్ను ప్రభావాత్మక రేటును పెంచాలనే లక్ష్యం అంతర్భాగంగా ఉంటుందని చెప్పవచ్చు. అయితే ఇందులో అనేక సమస్యలు న్నాయి. మన దేశంలో పన్నుల రేటు ఇప్పటికే అత్యధిక స్థాయిలో ఉన్నది. అయితే ఇటువంటి ప్రభావాత్మక పన్ను రేటు పెరుగుదల నైతికంగా సమర్థనీయం కాదు. ప్రభావాత్మక పన్నురేటు పెరుగుదల వల్ల చిన్న పరిశ్రమలు భారీగా నష్టపోతాయి. అంటే చట్టబద్ధంగా చేస్తున్న నూరు శాతం సరుకుల విక్రయాలపై 30 శాతం పన్నులు చెల్లించడం ఆ వ్యాపార సంస్థలకు పెనుభారంగా పరిణమిస్తుంది. తత్ఫలితంగా సదరు వ్యాపార సంస్థలు కొత్త మదుపుల యోచనను విరమించుకుంటాయి. పన్నుల వసూలుదారులను తప్పించుకోవడానికి సతమతమయ్యే వ్యాపారులు కొత్త మదుపులు చేసే విషయమై ఎలా ఆలోచించ గలుగుతారు? మరి మార్గాంతరమేమిటి? నల్లధనాన్ని అరికట్టడానికి కఠినచర్యలు అమలుపరుస్తూ అదే సమయంలో పన్నులరేటును గణనీయంగా తగ్గించాలి. పన్నురేట్ల తగ్గుదల వల్ల వ్యాపార సంస్థలు తమ లావాదేవీలను పూర్తిగా చట్ట బద్ధంగా నిర్వహించడం సుసాధ్యమవుతుంది. అధిక పన్ను రేట్లను తప్పించుకోవడానికి వ్యాపారులు మరింతగా నల్లధనం వైపు మొగ్గుచూపడాన్ని అది ప్రోత్సహించదు. నల్లధనాన్ని తగ్గించడానికి చేపడుతున్న చర్యలు, అదే సమయంలో పన్నులు రేట్లను తగ్గిస్తేనే ప్రయోజనకరమైన ఫలితాలనిస్తాయి. లేనిపక్షంలో వెలువడే ఫలితాలు ప్రతికూలంగా ఉండడం ఖాయం.

ప్ర: హ్యూమన్ ట్రాఫికింగ్ రోజురోజుకూ తీవ్రతరం అవుతోంది. ముఖ్యంగా పేద దేశాలలో తీరని శాపంగా తయారయింది. భారతదేశంలోనూ ఇటీవల మనుషుల అక్రమ రవాణా పెరిగిపోయిందని సర్వేలు చెబుతున్నాయి. వీటి నివారణకు చర్యలేవి?

–కె.కుమార్, గుంటూరు

జ: గ్రామీణ ప్రాంతాల్లో సరైన ఉపాధి అవకాశాలు లేకపోవడం, వరస కరవులు, ప్రకృతి విపత్తులతో పంటలు నష్టపోవడం వంటి అనేక అంశాలు అంతర్లీనంగా మనుషుల అక్రమ రవాణాకు ప్రధాన కారణాలవుతున్నాయని భారత్‌లో మానవ అక్రమ రవాణా పేరిట ఆసియా ఫౌండేషన్ రూపొందించిన నివేదిక పేర్కొంది. నిరాదరణకు గురవుతున్న వర్గాలకు సంబంధించిన సామాజిక భద్రత, సంక్షేమంపట్ల సరైన దృక్పథం కొరవడటంతో ఈ అమానవీయ ధోరణి అంతకంతకూ తీవ్రమవుతోంది. అయితే ఈ అంశాన్ని నేర కోణంలో మాత్రమే కాకుండా సామాజిక, ఆర్థిక దృక్పథంలోంచీ చూడాలి. మూలకారణాలపై దృష్టి సారించి పరిష్కార చర్యలు చేపట్టాల్సి ఉంది. గల్ఫ్ దేశాలకు వెళుతున్న వారిలో అనేకమందికి అక్కడ బతికే తెలివి, నైపుణ్యాలు ఉండటం లేదు. ఆ దిశగా వారిలో అవసరమైన నైపుణ్యాల పెంపు, అక్కడ ఎలా వ్యవహరించాలన్న దానిపైన శిక్షణ అవసరం. ఈ మేరకు గతంలో ఐరాస మహిళా వ్యక్తిత్వ, సమానత్వ సాధికార సంస్థతో ఏపీ రాష్ట్ర నైపుణ్యాభివృద్ధి సంస్థ అవగాహన ఒప్పందం సైతం కుదుర్చుకుంది. అయితే వాటి అమలు కార్యరూపం దాల్చాల్సి ఉంది. అలాగే గల్ఫ్‌కు వెళ్లేవారికి అక్కడి భాషా, సంస్కృతి, చట్టాలపైనా కనీస అవగాహన కల్పించాలి. కేరళ వంటి రాష్ట్రాల నుంచి ఉపాధి కోసం గల్ఫ్ దేశాలకు పెద్దయెత్తున వెళుతున్నప్పటికీ అక్కడ పనిచేసేందుకు అవసరమైన నైపుణ్యాలు, అక్కడి సంస్కృతి, భాష పట్ల కనీస అవగాహన వంటివి ఉండటం వారికి అవకాశంగా మారుతోంది. మన దగ్గరా ఆ పరిస్థితి రావాలి. విదేశాలకు వెళ్లేవారి వివరాల నమోదుకు ప్రత్యేక వెబ్‌సైట్ రూపొందించడంతోపాటు ప్రతి జిల్లా కలెక్టరు కార్యాలయంలో వారి పేర్లు వ్యక్తిగతంగా నమోదు చేసుకునే వీలు కల్పించాలి. దీనివల్ల ఎవరు ఏ దేశానికి పనికి వెళ్తున్నారన్న దానిపై సమాచారం అందుబాటులో ఉంటుంది. అక్కడ వారికి ఎలాంటి కష్టం వచ్చినా సత్వరం చర్యలు చేపట్టేందుకు వీలవుతుంది. మరోవంక గ్రామాల్లో మానవ అక్రమ రవాణాకు వ్యతిరేకంగా పెద్దయెత్తున అవగాహన కార్యక్రమాలు నిర్వహించాలి. ఈ క్రమంలో అవసరమైతే స్వచ్ఛంద సంస్థల సహకారం తీసుకోవాలి. రాష్ట్రంలో పనిచేస్తున్న మానవ అక్రమరవాణా విభాగాల పనితీరును ఎప్పటికప్పుడు సమీక్షించాలి. కార్మికుల అక్రమ రవాణాపై క్షేత్రస్థాయిలో అధ్యయనం నిర్వహించి; పోలీసులు, ఇతర నోడల్ సంస్థలకు దానిపై ఎప్పటికప్పుడు అవగాహన కల్పించాలి. అక్రమ రవాణానుంచి బయటకు తీసుకొచ్చిన బాధితుల సామర్థ్యాల పెంపు దిశగా చర్యలు తరచూ అక్రమ రవాణా బారిపడుతున్న వర్గాలను అప్రమత్తం చేయాలి. బడుగు వర్గాలకు స్వయం సమృద్ధి లభించేలా చూడాలి.

మెయిల్ అడ్రస్
SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

# లెజెండ్

గ్లోస్టర్ షైర్‌లోని బర్కిలీలో తన సహజ పరిసరాలను అధ్యయనం చేసిన ఆంగ్ల శాస్త్రవేత్త. జెన్నర్ మశూచి టీకా మందుకు మార్గదర్శిగా చాలా విరివిగా విశ్వసించబడ్డారు. అంతేకాదు ఆయన 'రోగ నిరోధక శాస్త్ర పితామహుడు'గా పేరు పొందారు. జెన్నర్ యొక్క ఆవిష్కరణ మరి ఏ ఇతర వ్యక్తి యొక్క కృషికంటే కూడా ఎక్కువ ప్రాణాలను కాపాడింది.

## మశూచికి మందు కనుగొన్న ఎడ్వర్డ్ జెన్నర్



ఒకప్పుడు మశూచి అంటే చాలా భయపడేవారు, ఎందువలనంటే ఈ జబ్బు బారిన పడిన ప్రతి ముగ్గురిలో ఒకరు చనిపోయేవారు. అంతేకాదు తరచుగా బ్రతికున్న వారి రూపురేఖలు చాలా ఘోరంగా మారిపోయేవి. లేడీ మేరీ వోర్ట్లి మోన్టాగూ 1716-1718 వరకు ఇస్తాంబుల్‌లో గడిపిన కాలంలో మశూచి కారకాన్ని శరీరంలోకి ప్రవేశపెట్టడం అనే ఒట్టామన్ సామ్రాజ్యం యొక్క భావనను కనిపెట్టారు, అయితే ఈ భావనను బ్రిటనుకు తీసుకువచ్చారు. కొన్ని సంవత్సరాల తరువాత, 60% మంది ప్రజలకు మశూచి రాగా, 20% మంది దీనివలన చనిపోతున్నారని వాల్టైర్ చెప్పారు. 1770 తరువాత సంవత్సరాలలో ఇంగ్లాండ్ మరియు జర్మనీలలో మనుషులలో మశూచికి అసంక్రమకరణంగా కౌపాక్స్ టీకాను ఉపయోగించే అవకాశాన్ని విజయవంతంగా పరీక్షించిన వారు కనీసం ఆరుగురు వ్యక్తులు (సెవెల్, జెన్సన్, జెస్టి 1774, రెండల్, ప్లెట్ 1791) ఉన్నారు.

ఉదాహరణకు, 1774లో మశూచి మహమ్మారిగా ఉన్న సమయంలో డోర్సెట్‌కు చెందిన రైతు బెంజమన్ జెస్టి తన భార్య మరియు ఇద్దరు పిల్లలకు విజయవంతంగా టీకామందు వేశారు. అంతేకాదు ఎంతో నమ్మకంతో కౌపాక్స్‌తో రోగ నిరోధకశక్తిని ప్రేరేపించారు, కానీ ఇరవై సంవత్సరాల తరువాత జెన్నర్ యొక్క పరిశోధన ద్వారానే ఈ పద్ధతి చాలా విరివిగా అర్థంచేసుకోబడింది. వాస్తవంగా, జెస్టి యొక్క పద్ధతి మరియు సఫలత గూర్చి జెన్నర్‌కు తెలిసి ఉండవచ్చు.

**జెన్నర్ మొదటి సిద్ధాంతం:**

రోగం సోకడానికి మొదటి కారణం ది గ్రీస్ అనబడే గుఱ్ఱాల రోగం. పైగా ఇది పొలం పనివాళ్ళ ద్వారా ఆవులకు వ్యాప్తి చేయబడుతుంది, ఆ తరువాత ఆవులలో వచ్చే అంటురోగం కౌపాక్స్‌గా బయటపడుతుంది. సాధారణంగా గొల్లభామలకు మశూచి రాదు అనే సామాన్య పరిశీలనను గుర్తిస్తూ, కౌపాక్స్ (మశూచిని పోలినటువంటి ఒక రోగం, కానీ తక్కువ తీవ్రత కలిగినది) బొబ్బలలో ఉండే చీము గొల్లభామలకు చేరడం వలన అది వారిని మశూచి నుండి రక్షిస్తుంది అని జెన్నర్ సిద్ధాంతీకరణ చేశారు. బుద్ధిపూర్వకంగా కౌపాక్స్ రోగాన్ని వారి కుటుంబాలలో ఏర్పరిచి, ఆ తరువాత ఆ కుటుంబాలలో మశూచి అపాయం తక్కువ కావడాన్ని గమనించిన బెంజమన్ జెస్టి మరియు ఇతరుల యొక్క కథలను వినడం అనే సౌలభ్యం ఆయనకు ఉండి ఉండవచ్చు.

1796, మే 14న, బ్లాసం అనే ఆవు నుండి కౌపాక్స్ సోకినటువంటి సారా నెల్మ్స్ అనే గొల్లభామ యొక్క చేతిపై ఉన్న కౌపాక్స్ బొబ్బల నుండి సేకరించిన పదార్థాన్ని జేమ్స్ ఫిప్స్ (జెన్నర్ యొక్క తోటవాని కొడుకు) అనే 8 సంవత్సరాల చిన్న పిల్లవానిలోకి ప్రవేశపెట్టడం ద్వారా జెన్నర్ తన పరికల్పనను పరీక్షించారు. ఈ ఆవు యొక్క చర్మం సెయింట్ జార్జ్ వైద్య పాఠశాలలోని (ప్రస్తుతం టూటింగ్ లో ఉంది) గ్రంథాలయం యొక్క గోడపై వేళ్ళాడుతూ ఉంటుంది. పాఠశాల యొక్క ప్రసిద్ధిచెందిన పూర్వ విద్యార్థిని జ్ఞాపకానికి తెస్తుంది.

జెన్నర్ ఒకేరోజున ఫిప్స్ యొక్క రెండు చేతులలోకి కౌపాక్స్ బొబ్బలలోని చీమును ప్రవేశపెట్టారు. నెల్మ్స్ యొక్క బొబ్బలను గోకటం ద్వారా వచ్చిన చీమును ఒక చెక్కముక్కపైకి తీసుకుని దానిని ఫిప్స్ యొక్క చేతులలోకి ఎక్కించడం ద్వారా రోగాకారకాన్ని ప్రవేశపెట్టడం విజయవంతంగా పూర్తిచేయబడింది. ఇది జ్వరాన్ని మరియు కొంత నలతను కలిగించింది కానీ ఎటువంటి గొప్ప అస్వస్థతను కలిగించలేదు. ఆ తరువాత, మశూచిని కలిగించేటటువంటి వేరియోలా విషాణువు యొక్క పదార్థాన్ని ఫిప్సు లోనికి ఎక్కించారు, ఇది ఆ కాలంలో రోగనిరోధక శక్తిని ఉత్పన్నంచేసేందుకు పరిపాటిగా చేసేటటువంటి ప్రయత్నం అయ్యుండవచ్చు. ఎటువంటి వ్యాధి సోకలేదు. ఆ తరువాత పిల్లవాడు మరలా మశూచిని కలిగించేటటువంటి వేరియోలా విషాణువు యొక్క పదార్థంతో సవాలు చేయబడ్డాడు మరియు ఎటువంటి రోగ లక్షణాలను చూపించలేదు అని జెన్నర్ నివేదించారు.





శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

# సమత పండుగ

గుండెలరేగడిపై గులాబి మొలిచింది
త్యాగపు నెత్తుటిలో జెండా వెలిసింది
విప్లవపుంతల్లో ధగధగ మెరిసింది
చీకటి బతుకుల్లో వెలుగులు చిమ్మింది

చక్రవర్తులను మట్టుబెట్టినది
నాజీ మూకను తరిమిగొట్టినది
పాపపుపాలన పాతిపూడ్చినది
సామ్యవాదమే చాటిచెప్పినది

శాంతి దీపమై వెలుగునిచ్చినది
రజాకార్లకు ఎదురు నిలిచినది
వెట్టిచాకిరి ఎగరకొట్టినది
గడీల దొరకలు గుబులురేపినది

దున్నెవానికే భూమిపంచినది
బాంచనన్నలకు అండనిలిచినది
వలసవాదమును కుళ్లబొడిచినది
పరపీడనను తాతరేసినది
పరాయిపాలన గొంతునొక్కినది

సమరవీరుల శంఖమైనది
ఉద్యమాలకే శ్వాసనిచ్చినది
అవినీతి రాజ్యమె కూల్చివేయగా
కష్టజీవుల సైన్యమెకదలగ

కార్మిక కర్షక ఐక్యతనిండగ
తల్లిభారతి సంతసించగ
నెరిపెపోరులో ఎరుపేమెరుపై
శాంతిసౌఖ్యముల సమతపండగై



–పి.ఎన్.మూర్తి
9441151762
pnmoor@gmail.com

## రన్నింగ్ వాయిస్

### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షికలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.



సూర్య ఆదివారం
18 సెప్టెంబరు 2016
జికా ప్రకంపనలు
ZIKA VIRUS

### వింతలు విశేషాలు

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి.వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–వెంకట్, గొల్లపూడి

## 'కూని'రాగాలు

కడదాకా లాగితే కలిసొచ్చేదుండదు..!
కర్మనుకుంటే కాలంతో పనుండదు..!!

కలిమిలేములు కలకాలం ఒకేలావుండవు..!
కాలమంతా నీకోసం కాపుకాయడముండదు..!!

మరణాన్ని జయించడమంటే భ్రతకడమే..!
కిరణాన్ని శాసించడమంటే అజ్ఞానమే...!!

కాలాలమార్పులలో కారణాలు అనేకం..!
శాసనాల తీర్పులలో పైరవీలు పవిత్రం..!!

మూలాల మార్పులు వాస్తులతో సాధ్యం..!
వాదాల తీర్పులతో ఆస్తులు మాయం..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

**కాలం కలిసొస్తే...**

సోమనాథం: ఒక్కొక్కప్పుడు ఒకరికి జబ్బు చేస్తే మరొకరికి జబ్బు నయం అవుతుంది తెలుసా?
లింగం: ఎలాగ రా?
సోమనాథం: 4 రోజుల నుండి మా ఆవిడ గొంతెండిపోయింది. నా చెవిపోటు తగ్గిపోయింది.

**హోంవర్క్...**

'రోజురోజుకీ హోంవర్క్‌లో తప్పులు రాస్తున్నావు. మీ డాడీని పిలిపించి చెప్పమంటావా?' మందలించాడు మాష్టారు.
'రోజూ మా డాడీయే రాస్తున్నారు సార్!' అసలు సంగతి చెప్పాడు విద్యార్థి

**కోపం...**

'అయ్యో...ఏమైందమ్మా చేతికి?'
'కుంపటి మండుతుండగా చూసుకోకుండా పొరపాటున చెయ్యి పెట్టానండీ...!'
'మరి ఆ కాలికి దెబ్బేంటి?'
'కోపంతో ఆ కుంపటిని తన్నానండీ...!"

**పొరపాటు...**

డాక్టర్ విచారంగా మొహం పెట్టి మంచం మీద కట్లతో పడుకున్న
మనిషితో ...'పొరపాటున మీకు ఒకకాలికి బదులు మరోకాలు తీసేశాను. అయినా మీరు సంతోషించాల్సిందేమిటంటే ప్రస్తుతం ఉన్న మీ రెండో కాలు నిక్షేపంగా ఉంది. దాన్ని తీసేయనక్కర్లేదు. మందులతో నయం చేయవచ్చు.' అన్నాడు.

నారు












జ్ఞానం, విజ్ఞానం సంపాదించుకోవాలని అందూ అభిలషించేవారే. అయితే వాటికి మూల్యం చెల్లించడానికి ఇష్టపడేవారెవ్వరూ లేరు. -జువెనల్



స్మర్ఫ్స్ అనే విచిత్ర జీవులు 1976లో వచ్చిన ది స్మర్ఫ్స్ అండ్ ది మ్యాజిక్ ఫ్లూట్ అనే సినిమాతో చిత్రసీమలోకి అడుగుపెట్టారు. బెల్జియం కార్టూనిస్టు పేయో సృష్టించిన ఈ కామిక్స్ ప్రజాదరణ పొందడంతో 1980లో ఏనిమేటెడ్ టీవీ సీరిస్‌గా తయారైన వాటి ఆధారంగా ఇప్పుడు 2011లో ది స్మర్ఫ్స్ పేరిట ఈ అమెరికన్ 3డి ఫిల్మ్ తయారైంది. ఇందులో స్మర్ఫ్స్ అనే ఏనిమేటెడ్ పాత్రలతోపాటు నీల్ పాట్రిక్ హారిస్, జోనాధన్ లింటర్స్, హాంక్ అజానా, జేమా మేస్, సోఫియా వెర్గారా అనే తారలు కూడా నటించారు. రకరకాల చేతులు మారి చివరకు సోనీ పిక్చర్స్ యానిమేషన్ వారు నిర్మించిన ఈ చిత్రానికి రాజా గోస్నెల్ దర్శకుడు.




# అద్భుత ప్రపంచానికి తీసుకెళ్లే ది స్మర్ఫ్స్

గతంలో ముందు మూడుసార్లు విడుదల తేదీని ప్రకటించి వాయిదా వేసుకున్న ఈ సినిమాను చివరకు 2011 జులై



29న ప్రపంచవ్యాప్తంగా విడుదల చేశారు. ఈ సినిమా గొప్పగా ఏం లేదని విమర్శకులు ఎంతగా విమర్శించినా, ఈ చిత్రం బాక్సాఫీస్ వద్ద కౌబాయ్స్ అండ్ ఏలియన్స్‌తో పోటీపడి కలెక్షన్లలో రెండవ స్థానాన్ని సంపాదించింది.

స్మర్ఫ్స్ అంటే మరుగుజ్జులు కాదు. వేలెడంత మనుషులు. గలివర్ ట్రావెల్స్‌లో వర్ణించిన లిల్లీపుట్స్, స్మర్ఫ్స్ ఒకటి కాదు. లిల్లీపుట్స్ వేలెడంతనే ఉన్నా అచ్చు మనుషుల్లాగే ఉంటారు. స్మర్ఫ్స్ మాత్రం వేలెడంత ఆకారంలో ఉన్నా నీలిరంగుతో, గొర్రె తోకతో ఉండే మనుషులు. వాళ్ల తలకట్టు సర్దార్జీల మాదిరిగా ఉంటుంది. వాళ్ల లోకమే వేరు. ప్రస్తుతానికి వస్తే సుదూర మాంత్రిక అరణ్యంలో అంగుష్ట మాత్రులు (స్మర్ఫ్స్) రాజ్యం ఉంటుంది. మానవ ప్రపంచంనుండి ఒక అదృశ్య తెర రక్షణ కవచంగా వాళ్లను దూరంగా ఉంచు తుంది. ఈ అంగుష్టమాత్రులు పక్షలమీద స్వారీ చేస్తూ, చెర్రీ పళ్లు సేకరిస్తూ గ్రూపు పెద్ద అజమాయిషీలో ఆడుతూ పాడుతూ ఆ పుట్టగొడుగుల రాజ్యంలో హాయిగా బతికేస్తుంటారు. వాళ్ల భయం అంతా గార్గమెల్ అనే మాంత్రికుడు.

బందీగా ఉన్న తెగ పెద్దను రక్షించుకోవడానికి మిగతా అయిదుగురు అంగుష్టమాత్రులతోపాటు పాట్రిక్ కూడా మాంత్రికుడ్ని ఎదిరిస్తాడు. మంత్రదండంతో అందర్నీ వేధిస్తున్న గార్గమెల్ చేతిలోనుండి నేర్పుగా కొట్టేసి, దాని సహాయంతో వాడ్ని దూరంగా విసిరివేస్తారు.

అతనికి సహాయంగా ఉండే అజారెల్ అనే పిల్లి గురించి. ఎందుకంటే ఈ మాంత్రికుడు అంగుష్టమాత్రులలో ఉండే నీలితనాన్ని లాక్కుని, దాంతో అతని మాంత్రిక శక్తులను వృద్ధిచేసుకోవాలనే కోరికతో వాళ్లను వెంటాడుతుంటాడు.

అంగుష్టమాత్రులు వాళ్ల బ్లూమూన్ పండగ వేడుకలు జరుపుకుంటున్న ఓ నిశి రాత్రివేళ మాంత్రికుడు గార్గమెల్ వాళ్ల రాజ్యంలోకి దొంగచాటుగా ప్రవేశించి వాళ్లను ఎత్తుకుపోవడానికి ప్రయత్నిస్తాడు. తెగ పెద్ద ఆధ్వర్యంలో వాళ్లంతా మాంత్రికుడ్ని, వాడి పిల్లిని ఎదిరిస్తారు. ఆ పోరాటంలో తప్పించుకోవడానికి ప్రయత్నించిన ఆరు గురు అంగుష్టమాత్రులు నిషిద్ధ ప్రాంతం గుండా వెళ్లి మాంత్రిక జల సొరంగంలో పడి, అక్కడినుండి న్యూ యార్క్ పట్టణంలోకి వచ్చి పడతారు. వాళ్ల వెనకాలే గార్గమెల్ అతని పిల్లి కూడా వచ్చేస్తాయి. న్యూయార్కులో బోలెడంత హంగామా సృష్టించిన తర్వాత ఈ అంగుష్ట మాత్రులు మార్కెటింగ్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసే పాట్రిక్, అతని భార్య గ్రేస్ ఇంట్లో ఆశ్రయం పొందుతారు. వీళ్లను చూసి పాట్రిక్ చిరాకుపడినా, గర్భవతియైన గ్రేస్ వాళ్లను ముద్దుచేస్తుంది. పాట్రిక్ మాత్రం వాళ్ల బాస్ నిరంకుశత్వ ధోరణుల వల్ల మనశ్శాంతి లేకుండా ఉంటాడు. చివరకు ఈ అంగుష్టమాత్రులే అతడి సమస్యలను పరిష్కరించ గలుగుతారు.

తారాగణం:
నీల్ పాట్రిక్ హారిస్
జేమా మేస్
సోఫియా వెల్గారా
హాంక్ అజారియా
తదితరులు.
ఫొటోగ్రఫీ: ఫిల్ మెహెక్స్
నిర్మాత: జోర్డాక్ వెర్నర్
దర్శకత్వం:
రాజాగోస్నెల్



గార్గమెల్ పిల్లి అంగుష్టమాత్రులను వెంటాడినప్పుడు దానికి చిక్కిన వెంట్రుకలతో గార్గమెల్ నీలిద్రవాన్ని కొన్ని చుక్కలుగా తయారుచేస్తాడు. దాని సహాయంతో అంగుష్ట మాత్రులను కనుక్కుని వాళ్లనువెంటాడుతుం టాడు. ఈ లోపుగా అంగుష్టమాత్రులు తమ ప్రాం తానికి వెళ్లే రహస్య జల సొరంగాన్ని కనుగొంటారు. అది బ్లూ మూన్ ఉదయించే పున్నమి రాత్రి లోనే తెరుచుకుం టుంది. ఈలోగా వెంబడించిన గార్గమెల్ తెగపెద్దను పట్టుకుంటాడు.

బందీగా ఉన్న తెగ పెద్దను రక్షించుకోవడానికి మిగతా అయిదుగురు అంగుష్టమాత్రులతోపాటు పాట్రిక్ కూడా మాంత్రికుడ్ని ఎదిరిస్తాడు. మంత్రదండంతో అందర్నీ వేధిస్తున్న గార్గమెల్ చేతిలోనుండి నేర్పుగా కొట్టేసి, దాని సహాయంతో వాడ్ని దూరంగా విసిరివేస్తారు. పున్నమి చంద్రుడు ఉదయించడంతో రహస్య సొరంగం తెరుచుకుంటుంది. అంగుష్టమాత్రులు అందరికీ వీడ్కోలు చెప్పి ఆ జల సొరంగంలోకి దూకి తమ రాజ్యానికి చేరుకుంటారు.

ఈ చిత్రంలో మాంత్రికుడు గార్గమెల్‌గా నటించిన హాంక్ అజారియా నటన అద్భుతం. హాస్యభరితమైన మాటలు, సన్నివేశాలు ఉన్న ఈ చిత్రాన్ని పిల్లలు తప్పకుండా ఇష్టపడతారు. ఇందులో ఆ తెగ పెద్ద తన వయసు 546 సంవత్సరాలని తెలియజేయడం ఆశ్చర్యమనిపిస్తుంది. గతంలో వచ్చిన ది అడ్వెంచర్స్ ఆఫ్ ది స్మర్ఫ్స్ అనే బ్లాక్ అండ్ వైట్ కార్టూన్ చిత్రంతో దీన్ని పోల్చలేం. ఎందుకంటే ఈ సినిమా చూస్తుంటే అర్విన్ అండ్ చిప్‌మంక్స్, ఎన్‌ఛాంటెడ్, గారీఫీల్డ్ అనే చిత్రాలు తప్పకుండా జ్ఞాపకం వస్తాయి.








దీపావళి చిత్రంలో సరియా నాతో సమరాన నిలువగలడా అంటూ సత్యభామ పొగరు, అహంకారమంతా తన గొంతులో నింపుకుని పాడిన పాట వినగానే ఎ.పి.కోమల గుర్తుకువస్తారు. ఎ.పి.కోమల (ఆర్కాటు పార్థసారథి కోమల) పుట్టి పెరిగిందంతా మద్రాసులోనే. నాలుగేళ్ళ వయసులోనే పాటలు పాడుతున్న కోమలను చూసిన గాడవల్లి పైడిస్వామి శాస్త్రీయ సంగీతాన్ని నేర్పించడానికి రాజమండ్రి తీసుకెళ్ళారు. అక్కడ సంగీతంతో పాటు తెలుగు కూడా నేర్చుకుంటూనే సంగీత కార్యక్రమాల్లో పాల్గొని బహుమతులు అందుకున్నారు. రెండేళ్ళ తర్వాత తిరిగి మద్రాసు చేరుకున్నారు కోమల.



# కోకిల గానామృత కోమల

సంగీతంలో అవగాహన ఉండడంతో తొమ్మిదేళ్ళ వయసులోనే తెలిసిన వారి ద్వారా ఆల్ ఇండియా రేడియోలో ఉద్యోగంలో చేరారు. రేడియోలో వచ్చే 'గానలహరి' కార్యక్రమంలో విద్యార్థిగా పాల్గొన్నారు. అదే వయసులో ప్రయాగ నరసింహమూర్తి, రేడియో స్టేషన్లో పనిచేసే ఎస్.ఎన్.మూర్తి గార్ల ద్వారా చిత్తూరు నాగయ్య దర్శకత్వంలో వచ్చిన 'త్యాగయ్య' చిత్రంలో పాడే అవకాశం వచ్చింది. మూడు నెలల రిహార్సల్స్ తర్వాత "మధురానగరిలో చల్లనమ్మ బోదు" అనే పాటను జమునారాణి గారితో కలిసి పాడారు. అలా మొదటి సినిమా పాట తెలుగు చిత్రంలోనే పాడే అవకాశం లభించింది. ఆ తర్వాత వరుసగా తమిళ, కన్నడ, మలయాళ, సింహళ భాషల్లో పాటలు పాడే అవకాశాలు వెంటవెంటనే వచ్చాయి. అవకాశం వచ్చినప్పుడు ఓ పక్క సినిమా పాటలు పాడుతూనే ఆలిండియా రేడియోలో బాధ్యతలు నిర్వహిస్తూ 1995లో పదవీ విరమణ చేశారు. అంతకాలం రేడియోలో గ్రేడ్ వన్ ఆర్టిస్టుగా పనిచేసినా సినిమా రంగం ఇచ్చిన గుర్తింపు ఉద్యోగం ఇవ్వలేకపోయిందని కోమల అభిప్రాయం.

'రక్షరేఖ' చిత్రంలో ఘంటసాలతో కలిసి "ఓ... ఓహొ రాజకుమారా" అంటూ తొలి యుగళగీతం ఆలపించారు. ఓగిరాల రామచంద్రరావు, ఘంటసాల, సాలూరి రాజేశ్వరరావు, పెండ్యాల నాగేశ్వరరావు, కె.వి.మహదేవన్.... ఇలా ఆ రోజుల్లోని ప్రముఖ సంగీత దర్శకులందరి దగ్గరా కోమల పాడారు. 1975 'యశోద కృష్ణ' అనే తెలుగు చిత్రంలోని పాట ఆమె పాడినవాటిలో ఆఖరిది. అలా తొలిపాట, చివరిపాట తెలుగులోనే.

**రేడియో సింగర్‌గా:** బాలాంత్రపు రజనీకాంతరావు గారు పాడించిన దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి "ఆకులో ఆకునై...", గురజాడ "దేశమును ప్రేమించుమన్నా" అని రేడియోలో పాడిన లలితగీతాలు కోమలకు బాగా పేరు తెచ్చిపెట్టాయి. వివిధ భాషల్లో దాదాపు ఐదువేల పాటలు పాడిన కోమలకు తమిళంలోనే గాయనిగా మంచి పేరు వచ్చింది.

'పరమానందయ్య శిష్యుల కథ'లో లీలతో కలిసి "వనిత తనంత తానే వలచిన" పాట, 'బంగారు పంజరం' చిత్రంలో "పదములె చాలు రామా". 'జయసింహ'లో "మురిపెము మీర మీ కోరిక తీర, మనసైన చెలి పిలువు", 'పిచ్చి వుల్లయ్య'లో "ఓ పంతులు గారు", 'పెంపుడు కొడుకు, రంగుల రాట్నం' చిత్రాల్లో పాడిన పాటలు ఆమెకు గుర్తింపు తెచ్చాయి.

సినిమాకు సంబంధించి ఎస్. వరలక్ష్మి పాటలు, శాస్త్రీయ సంగీతంలో ఎం.ఎల్.వసంతకుమారి పాటలను ఇష్టపడే కోమల పి.సుశీల గాత్రంలో ఉండే మార్దవం, స్పష్టత ఇంకెవరి గొంతులోనూ రాదంటారు.

చెన్నై ప్రభుత్వం 'మధురవాణి' బిరుదు, బాలమురళీకృష్ణ గారి చేతులమీదుగా సన్మానం, అమృతగానవర్షిణి, ఘంటసాల స్వర్ణ కంకణం వంటి బహుమతులు ఆమె గాన ప్రతిభకు తార్కాణాలు. ఎమ్మెస్.సుబ్బులక్ష్మి కోమలకు ఫోన్ చేసి అభినందించడం, ముఖ్యమంత్రిగా ఉన్న ఎం.జి.రామచంద్రన్ అభినందిస్తూ ఉత్తరం రాయడం తన జీవితంలో మర్చిపోలేని సంఘటనలుగా భావిస్తారు.

సంగీతమనే సాగరంలో ఓపికున్నంత వరకు పాడుతూ ఉండాలనేది కోమల కోరిక. సంగీతాన్ని ఓ వ్యాపకంగా కాకుండా అదో గమ్యంలా సాధన చేయాలంటారు కోమల. త్యాగరాజ కీర్తనలు, దీక్షితార్ కృ్‌ఎతులు పాడుకోవడంలో ఉన్న ఆనందం మరెందులోనూ ఉండదనే కోమల రత్నకాంతి, భవప్రియ, శ్రీ కంఠి రాగాలంటే ఎక్కువ ఇష్టపడతారు.

కళాకారులు సున్నిత మనస్కులు అంటారు. కోమల జీవితాన్ని చూస్తే అది నిజమేనేమో అనిపిస్తుంది. కుటుంబ బాధ్యతల రీత్యా, మరికొంతమంది తోటి కళాకారిణుల వివాహ వైఫల్య జీవితాల్ని దగ్గరగా చూడడం వల్ల ఆమె జీవితంలో పెళ్ళి మాట తలపెట్టలేదు.

ఆర్కాట్ పార్థసారథి కోమల ఆగష్టు 28, 1934లో జన్మించారు. దక్షిణభారత దేశపు ప్రముఖ నేపథ్యగాయని. ఈమె 1950, 60వ దశకాల్లో తమిళం, మళయాలం మరియు తెలుగు భాషల్లో అనేక పాటలు పాడారు. రేడియో కళాకారిణి కూడా...తమిళనాడు ప్రభుత్వం ఈమెను కళైమామణి బిరుదంతో సత్కరించింది.

కోమల మద్రాసులోని తిరువళ్ళికేనులో జన్మించారు. ఈమె తల్లితండ్రులు పార్థసారథి, లక్ష్మి. మూడేళ్ళ వయసులోనే పాటలు పాడటం ప్రారంభించిన కోమలకు ఒక తెలిసిన వ్యక్తి రేడియోలో పాడే అవకాశం ఇప్పించడం జరిగింది. అదే సమయంలో రేడియోలో నాదస్వరం వాయించటానికి రాజమండ్రి నుండి మద్రాసు వచ్చిన గాడవల్లి పైడిస్వామి ఆమె పాటను విని, ఆనందపడి, కోమలని తనతో పాటు రాజమండ్రి తీసుకువెళ్ళి అక్కడ శాస్త్రీయ సంగీతంలో శిక్షణ ఇచ్చాడు. జన్మతః తమిళురాలైనా కోమల సంగీతం నేర్చుకున్నది తెలుగు నేలపైనే... తొలిసారిగా ఒరిస్సాలోని బరంపురంలో 1943లో జరిగిన శాస్త్రీయ సంగీత పోటీలో ముత్తుస్వామి దీక్షితార్ కృతి శ్రీ గణనాయకం పాడి వెండిభరిణె గెలుచుకున్నారు కోమల. ఈ కార్యక్రమానికి వచ్చిన దుర్గాబాయి దేశ్‌ముఖ్ కోమలను ప్రశంసించి మళ్లీ ఆ కృతిని పాడించుకున్నారు.

సంగీత అవగాహన ఉండటం వలన 1944లో తొమ్మిదేళ్ళ వయసులోనే ఈమెకు ఆలిండియా రేడియోలో ఉద్యోగం వచ్చింది. రేడియోలో ప్రసారమయ్యే గానలహరి కార్యక్రమంలో విద్యార్థినిగా పాల్గొనేది. అక్కడ పనిచేస్తుండగా సినిమాల్లో పాడే అవకాశం వచ్చింది. కోమల ప్రయాగ నరసింహశాస్త్రి సిఫార్సుతో 1946లో చిత్తూరు వి.నాగయ్య తీసిన త్యాగయ్యలో తొలిసారిగా సినిమా పాట పాడారు. ఆనందభైరవి రాగంలో మధురానగరిలో చల్లనమ్మ అనే ఈ పాటకు ఆమె 250 రూపాయల పారితోషికం అందుకున్నారు. ఈమె సినిమాలలో పాడిన తొలిపాట, చివరి పాట తెలుగు పాటలే కావటం విశేషం. ఆలిండియా రేడియోలో ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించిన కోమల 1995లో పదవీ విరమణ పొందారు.












## తెలుసుకోండి'లా'

# వారసత్వ సర్టిఫికెట్ తీసుకోవడం ఎలా?

మా పెద్ద నాయన పెళ్లి చేసుకోలేదు. కాని అతను ప్రభుత్వ ఉద్యోగి, కొన్ని స్థిరాస్తులు సంపాదించాడు. మా నాయన చిన్నవాడు. వీళ్లు మొత్తం ముగ్గురు అన్నదమ్ములు. వారిలో పెద్ద నాయన పెళ్లి చేసుకోలేదు కాబట్టి అతనికి వారసత్వం లేదు. రెండో పెద్ద నాయన కూడా ప్రభుత్వ ఉద్యోగి ఆయనకు నలుగురు పిల్లలు. ఒక ఆడపిల్ల, ముగ్గురు మగ పిల్లలు. అందరికి పెళ్లిళ్లు అయి స్థిరపడ్డారు. మా నాయనకు ప్రభుత్వ ఉద్యోగం లేక చేతి పనిపై ఆధారపడి కష్టపడి మమ్ములను చదివించాడు. నాయనకు ఇద్దరము కొడుకులము నేను పెద్దవాడిని నాకు ఎలాంటి ఉద్యోగం లేదు. మా




పెద్ద నాయన చనిపోయి దాదాపు సంవత్సరం కావస్తోంది. కాని మాకు మాత్రం ఈ మధ్య కాలంలో తెలిసింది. వెంటనే నును మా నాయనను తీసుకొని మా పెద్ద నాయన చేసే ఆఫీసుకు వెళ్లి విచారిస్తే నిజంగానే చనిపోయినట్లు నిర్ధారణ జరిగింది. వెంటనే పై అధికారులను కలిసి పూర్తి వివరాలు చెప్పి నాకు మా పెద్ద నాయన ఉద్యోగం ఇవ్వగలరని దరఖాస్తు చేశాను. అప్పుడు ఆ అధికారులు మా దరఖాస్తు చదివి మీ పెద్దనాయన మీకు రాసిన పత్రం ఏమైనా వుందా? లేదంటే కోర్టు నుండి వారసత్వ సర్టిఫికెట్ తెస్తే దానిని బట్టి విచారణ జరిపి చర్య తీసుకోగలమని చెప్పారు. కాని ఉద్యోగం ఇస్తామని ఖచ్చితంగా చెప్పడం లేదు. ఇప్పుడు నేను వారసత్వ సర్టిఫికెట్ పొందాలంటే ఏమి చేయాలి. అదేవిధంగా మా పెద్ద నాయన ఉద్యోగంతో పాటు అతని వారసునిగా ఏమి చేయవలెను.

– సాంబశివరావు, తెనాలి

మీ పెద్ద నాయన ఎలా, ఎక్కడ చనిపోయినది చెప్పలేదు, అదేవిధంగా మీ పెద్ద నాయనతో పాటు ఎక్కువ ఎవరు ఉండేవాళ్లు, మిమ్మల్ని దత్తత తీసుకున్నట్లు ఏమైనా ఆధారాలు ఉన్నాయా చెప్పలేదు. ఒకవేళ దత్తత తీసుకున్నా... మీపై ఏమైనా వీలునామ, ఇతర పత్రాలు రాసి ఇచ్చారా చెప్పలేదు. ఆధారాలు ఏవీ లేకుండా మీకు ఎలాంటి హక్కు సంక్రమించదు. ఇక వారసత్వ సర్టిఫికెట్ గురించి చెప్పాలంటే కోర్టు ద్వారా మీరు ఆ సర్టిఫికెట్ పొందవచ్చు. అయితే ఖర్చుతో పాటు చాలా కాలం మీరు వేచి చూడాల్సి రావచ్చు. ఎందుకంటే ఈ మధ్య కాలంలో విల్లు లేకుండా చనిపోయిన వారసులకు చనిపోయిన వ్యక్తి ఉద్యోగం కాని, స్థిర ఆస్తులు గాని కోర్టు ఇచ్చిన వారసత్వ సర్టిఫికెట్ ద్వారా హక్కు పొందే అధికారం లేదని సుప్రీ కోర్టు తేల్చింది. అలా కోర్టు ఇచ్చిన వారసత్వ సర్టిఫికెట్ ద్వారా మీ పెద్ద నాయనకు రావలసి బాకి ఏమైనా ఉన్నచో వసూలు చేసుకొనవచ్చును. ఆ సొమ్మును వారసుల అందరికి పంచాల్సిందే. కాని ఆ ధృవపత్రాల వల్ల బంధుత్వం రుజువైనట్లు కాదు అని చిత్తారంజన్ సింగ్ అనే ప్రభుత్వ పాఠశాల ప్రధానోపాధ్యాయుడి విషయంలో సుప్రీం కోర్టు తీర్పు ఇచ్చింది. పైగా వారసత్వ సర్టిఫికెట్ గురించి మీ పెద్ద నాయన చనిపోయిన ప్రాంత పరిధి సివిల్ కోర్టులో గాని లేక పెద్ద నాయన స్థిరాస్తుల పరిధి సివిల్ కోర్టులో గాని దావా వేయవద్దు దాని కోర్టు ఫీజు ఆస్తుల మొత్తం విలువపై కట్టవలెను. అదే విధంగా ఒక దినపత్రిక ద్వారా ప్రకటన చేయవలెను. అలా ఖర్చు పెట్టినా పెద్దగా ఫలితం లేదు.

★★★

మా తల్లిదండ్రులకు మేము నలుగురు ఆడపిల్లలం, నలుగురు మగ పిల్లలం, మా నాయనకు ఇద్దరు భార్యలు పెద్ద భార్యకు ఇద్దరు ఆడపిల్లలు. పెద్ద భార్య చనిపోయింది. ఆ తర్వాత భార్యకు ఇద్దరం ఆడపిల్లలం, వీరిలో నేను చిన్నదానిని, నలుగురు మగ పిల్లలు. వాళ్లు అందరు నాకన్న పెద్దవాళ్లు. మా తండ్రి వడ్రంగి పని చేసి కొన్ని భూములు, ఇల్లు సంపాదించాడు. కొంత ఆస్తి మా నాయన తండ్రిది. మా నాయన చనిపోయాడు. మా అమ్మ మాత్రమే ఉన్నది. మా అన్నలు ఆస్తి పంపకాలు చే సుకొంటున్నారు. మా ముగ్గురు అక్కలు మా వద్ద మా తమ్ముళ్లు మమ్ములను మంచిగానే చూసుకుంటున్నారు. మాకు ఎలాంటి బేధాభిప్రాయం లేదు. కావున నీవు కూడా జోక్యం చేసుకోవద్దు అలా చేస్తే ముందు ముందు మనలను దగ్గరకు రానివ్వరు. కావున వద్దు అని చెబుతున్నారు. కాని నా భర్త మాత్రం ఎందుకు తీసుకోవద్దని ఒత్తిడి చేస్తున్నారు. వీటన్నిని దృష్టిలో పెట్టుకుని ముందు ముందు జరగబోయే పరిణామాలపై న్యాయ సలహా ఇవ్వగలరు.

– సత్య స్వరూప, కొతకోట, మహబూబ్‌నగర్ జిల్లా

మీరు రాసిందంతా బాగానే ఉన్నది. కాని మీది వివాహం ప్రేమ వివాహమా? లేక పెద్దవాళ్లు చేసినదా చెప్పలేదు. అదే విధంగా మీ పెళ్లి తేది చెప్పలేదు. మీ భర్త ఏమి పని చేయస్తున్నారో చెప్పలేదు. ఏదేమైనా మీ నలుగురు అన్నలతోపాటు మీకు ఆస్తిలో సమాన వాటా వస్తుంది. కాని మీతోపాటు మీ ముగ్గురి అక్కలకు కూడా సమానా వాటా హక్కు ఉంటుంది. అప్పుడు మీ నాయన సంపాదించిన ఆస్తిలో మీ అమ్మగారికి ఒక వాట ఇచ్చి మిగతా వాటా ఎనిమిది మందికి సమానమైన వాటా లుగా వచ్చును. దీనికి మీరు మీ దగ్గరలో సివిల్ కోర్టులో పార్టిషన్ దావా వేసినచో తప్పక మీ వాటా 1/9 కింద వచ్చును. కాని మీ ముగ్గురు అక్కలు చెప్పినట్లు మీ అన్నయ్య మిమ్ముల మంచిగా చుసుకొనుచున్నప్పుడు మీరు వారిపై ఒత్తిడి పెట్టి మీ వాటా తీసుకుంటే తిరిగి మీపై ఉన్న ప్రేమ, విరక్తిగా మారుతుంది. అప్పుడు మీ అన్నయ్యలతో మీ అక్కలు కూడా మీతో అంత ప్రేమగా ఉండకపోవచ్చును. ఒకరకంగా చెప్పాలంటే ప్రేమతో ఏమైనా సాధించవచ్చును. కానీ బలవంతంగా కొంత మేరకు సంపాధించిగలం. కాని సంతోషంగా అందరితో కలిసి ఉండలేం అని చెప్పవచ్చు. అలా అని మీ వాటా అడగవద్దని నేను చెప్పలేను. న్యాయపరంగా ఆ హక్కు కూడా మీకు వుంది. అది మీ సొంత నిర్ణయంపై ఆధారపడి ఉంది. కాకపోతే ఒక్క విషయం మీ భర్త మీపై చేస్తున్న ఒత్తిడి గూర్చి మీ అక్కలతో, అన్నలతో చర్చిస్తే పరిష్కారం తప్పక దొరుకుతుంది. అలా కూడా మీకు న్యాయం జరగవచ్చు.

# ఫ్లోరింగ్ ఎలా ఉండాలి?

## తూర్పు-పడమర

ప్రః పడమర హద్దుమీద ఇళ్ళు కట్టుకోవచ్చా?

(విశాల్–వరంగల్)

జః శాస్త్రప్రకారం పడమరవైపు, దక్షిణంవైపు హద్దు చేసుకొని కట్టుకునే అవకాశం ఉంది. కాని చుట్టు ప్రదక్షిణం రావాల్సిన అవసరం అనేదే మొదటి విధానం. కొన్నిచోట్ల స్థలం లేకపోయినప్పుడు స్థలం కుదరనప్పుడు పశ్చిమాన్ని హద్దు చేసి ఇళ్ళు నిర్మిస్తూ ఉంటారు. ఇవన్నీ ప్రత్యామ్నాయ మార్గాలు.

ఐతే పడమర వీధి వచ్చినప్పుడు తప్పనిసరిగా స్థలాన్ని పడమరవైపు రెండు ఫీట్లు అయినా వదిలి గృహాన్ని నిర్మించడం మంచి పద్ధతి. విధిలేదు పక్కవారి ఇళ్ళు ఉన్నాయి అనుకున్నప్పుడు మనం హద్దు చేసుకొని నిర్మించుకుంటే దోషం లేదు. ఐతే పక్కవారి స్థలంగాని, ఇళ్ళుగాని మన ఇంటికన్నా చాలా లోతులో ఇళ్ళు నిర్మించబడి ఉంది అన్నప్పుడు పశ్చిమం హద్దు పనికిరాదు. ఆ రకంగా తెలిసిన వారిచేత చూపించుకొని నిర్మాణానికి సిద్ధం కండి.

ప్రః ఇంట్లో ఫ్లోరింగ్ ఎలా ఉండాలి?

(కృష్ణ – హయత్‌నగర్)

జః ఫ్లోరింగ్ విషయంలో రెండు జాగ్రత్తలు తప్పనిసరిగా తీసుకోవాలి. అవి వేసేటటువంటి ఎత్తుపల్లాలు, అవి ఉండేటటువంటి రంగు. చాలా చోట్ల అనేక రకాలైనటువంటి మచ్చలతో కూడుకున్నటువంటి ఫ్లోరింగ్‌ని డార్క్ కలర్ ఫ్లోరింగ్స్‌ని వాడుతూ ఉంటారు.

వాస్తుపరంగా నైరుతి పడకగదిలో నీరు ఈశాన్యం గుండా వెళ్ళేటట్టుగా లేదా ఉత్తరం వైపు వెళ్ళేటట్టుగా, తూర్పు వెళ్ళేటట్టుగా ఫ్లోరింగ్‌ని కొద్ది వాలుతో ఏర్పాటు చేసుకోవడం ప్రధాన విషయం.

అలాగే మనం జీవితకాలం ఉండే ఆ ఫోరింగ్‌ని చాలా ఉత్సాహంతో కూడుకున్న రంగులతో ఫేర్ కలర్స్‌తో ఏర్పాటు చేసుకోవలసిన అవస రంకూడా ఉంది.

డార్క్ కలర్స్, మనసుపైన చీకటి పొరల్ని కమ్మే మచ్చలతో కూడు కున్న వాటిని వేసుకోకుండా ప్రశాంత భావాలను వ్యక్తపరిచే ఫ్లోరింగ్స్‌ని మనం ఏర్పాటు చేసుకోవాలి.

మనకు తెలియకుండానే మనం ఏర్పాటు చేసుకునే పరిసరాలు మన కోపం పైన, జలసిపైన అవి ప్రభావాన్ని కలిగిస్తూ ఉంటాయి. కాబట్టి ఇంటిలోపలి గోడలకి, ఇంటిలోకి ఫ్లోరింగ్‌కి చాలా ప్రాధాన్యతనిచ్చి మనం జాగ్రత్తలు తీసుకోవాలి. అనేక రకాలైన భావావేశాలతో మనం గృహంలో సంచరిస్తాం కాబట్టి ఆ సమయాల్లో అదుపుతప్పకుండా వ్యవహ రించేటువంటి లక్షణానికి ఈ ఫ్లోరింగ్ చాలా ప్రధా నంగా పనిచేస్తు ఉం టుంది. మీకు నచ్చిన మీరు ఎంపిక చేసుకున్న ఫేర్ కలర్స్‌ని వాడుకుంటే మంచిది.

ప్ర: పాత ఇంటి వాస్తు ప్రభావం ఉంటుందా?

ప్రార్థన– పోచంపల్లి

జ: తప్పకుండా ఉంటుంది. పాత ఇంటి ప్రభావం, ఆ పాతఇంటితో ఉన్న సంబంధాలను బట్టి కొంత మేరకు ఆ సంబంధం ఉంటుంది. ఉన్నఇల్లు వాస్తుకు ఉన్నా కూడా దోషాలతో కూడుకున్న ఇంటితో సంబంధం పూర్తిగా తెగతెంపులు కాన్పప్పుడు సెలవుల్లోనూ, ఆయా పండగ వేళల్లోనూ కుటుంబంతో కలిసి ఆ పాత ఇంటితో అనుబంధాన్ని కలిగి ఉన్నప్పుడు ఆ చోట కొన్ని రోజులు గడిపి వస్తున్నప్పుడు ఆ పాత ఇంటి దోశాల ప్రభావం తప్పకుండా ఉంటుంది.

అలాగే అమ్మ, నాన్నలు, మిగతా పెద్దవాళ్లు పాత ఇంటిలో ఉంటున్నప్పుడు వాళ్లతో కూడుకున్న బాంధవ్యాల ద్వారాకూడా ఆ పాతం ఇంటి దోశాల ప్రభావం ఆ కుటుంబ సభ్యులందరి పైనా పడుతూనే ఉంటుంది.

కాబట్టి గృహాలు తమవితవుతో అనుబంధాలు కలిగి ఉన్నప్పుడు వాటిని మనం ఏదో రకంగా వినియోగిస్తున్నప్పుడు ఆయా గృహాల వాస్తు దోషాలు సవరించుకోవడమే సత్ఫలితాలను ఇస్తుంది.

అమ్మ, నాన్నలు, మిగతా పెద్దవాళ్లు పాత ఇంటిలో ఉంటున్నప్పుడు వాళ్లతో కూడుకున్న బాంధవ్యాల ద్వారాకూడా ఆ పాతం ఇంటి దోశాల ప్రభావం ఆ కుటుంబ సభ్యులందరి పైనా పడుతూనే ఉంటుంది.
కాబట్టి గృహాలు తమవితవుతో అనుబంధాలు కలిగి ఉన్నప్పుడు వాటిని మనం ఏదో రకంగా వినియోగిస్తున్నప్పుడు ఆయా గృహాల వాస్తు దోషాలు సవరించుకోవడమే సత్ఫలితాలను ఇస్తుంది.



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్

# దెయ్యం పై మమకారం



**హర్రర్ కామెడీ సినిమాల జోరు పెరిగాక చాలా చిన్న సినిమాలు బ్రతకడానికి ఆస్కారం లభించింది. ఇదే ట్రెండ్ లో టాలీవుడ్, కోలీవుడ్ లో అనేక చిన్న సినిమాలు భారీ విజయాలు అందుకున్నాయి. ఇప్పుడు హర్రర్ కామెడీ రేంజ్ పెరిగింది. త్వరలోనే ఇద్దరు స్టార్ హీరోయిన్లు దెయ్యాలుగా నటించేందుకు రెడీ అవుతున్నారు. అభినేత్రి సినిమాలో తమన్నా ఇటువంటి రోల్ లోనే నటిస్తోంది. ఇక తాజాగా రెజీనా కూడా దెయ్యం పాత్రలో భయపెడతానంటోంది.**

రీసెంట్‌గా హర్రర్ కథలో మిల్కీ వైట్ ద్యూయెల్ రోల్ చేస్తోదంట. ఒకటి యాక్ట్రెస్‌గా మరొకటి అమాయికురాలిగా..ఈ రెండు పాత్రల్లో ఒకటి ఘోస్ట్ రోల్ అనే మాట వినిపిస్తోంది. తెలుగు, తమిళ , హిందీ వెర్షన్ లో ఈ సినిమా విడుదలకు సిద్ధమవుతోంది. ప్రభుదేవా, సోనూ సూద్ కీలక పాత్రలు పోషిస్తున్నారు. విజయ్ దర్శకుడు. సప్తగిరి కీలక పాత్ర పోషించాడిందులో.

**తడి సోకుల తమన్నా:**

అందమే ఆనందం, ఆనందమే జీవిత మకరందం అన్నారో కవి. అంతటి మధురానందం ఉన్న అందం కోసం అందరూ ఆశ పడతారు.మగువలు మరీనూ. అయితే అందాన్ని కాపాడుకోవడం ఎలా? అన్నది చాలా మందిలో కలిగే ప్రశ్న. అలాంటి వారికి మిల్కీ బ్యూటీ తమన్నా సౌందర్య రహస్యం సమాధానం కావచ్చు. అందానికి అందం తమన్నా. నవ నవలాడే ఆమె మేను అందాల సీక్రెట్ తమన్నా మాటల్లోనే చూద్దాం.

...నా దినచర్య చాలా నిబద్ధతతో కూడి ఉంటుంది.ఆహార నియమాలు పాటిస్తాను. ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌గా బ్రెడ్ శాండ్‌విచ్, ఆమ్లేట్‌ను తీసుకుంటాను. మధ్యాహ్నం ఒక్క చపాతి, రైస్,చికెన్ ఫ్రై తింటాను. నేను ముంబైలో పుట్టి పెరిగినా చపాతీ అంటే అంతగా ఇష్టం ఉండదు. అందుకే మధ్యాహ్నం వరి అన్నమే తింటాను. మధ్యలో గంటకోసారి కాయగూరల సూప్ తీసుకుంటాను. ఇక ఆయిల్ ఫుడ్‌ను తక్కువ మోతాదులో తింటుంటాను. రోజుకు మూడు పూటలా ఫుల్‌గా భోజనం లాగించేయకుండా కొంచెం కొంచెం ఆరు సార్లు తింటాను.

**సౌందర్యం టిప్స్:**

ఇక సౌందర్య టిప్స్ గురించి చెప్పాలంటే షూటింగ్ సమయంలో లైట్స్ ముందు, ఎండల్లో నిలబడటం వల్ల ముఖం నల్లబడుతుంది. అందువల్ల రోజూ శెనగపిండిలో పెరుగు కలిపి ఆ గుజ్జును ముఖానికి పట్టించి కొంత సేపు తరువాత చల్లని నీళ్లతో కడిగితే ముఖచాయ పెరుగుతుంది. రాత్రి వేళల్లో పడుకునే ముందు తలకు కొబ్బరి నూనె పట్టించి మసాజ్ చేసుకుంటే రక్తప్రసరణ జరిగి జుత్తు రాలకుండా ఉంటుంది.చల్లని నీళ్లతో స్నానం చేయడం మంచిది. అన్నిటికంటే ప్రశాంతమైన నిద్ర చాలా మేలు చేస్తుంది. సమయం దొరికినప్పుడల్లా మంచి కవితలు చదువుతాను. టెన్షన్‌గా ఉంటే మంచి సినిమా పాటలు వింటాను.ఆరోగ్యకరమైన ఆహారం తీసుకుంటాను.మంచినీళ్లు, పళ్ల రసాలు అధికంగా తీసుకుంటాను. షూటింగ్ లేకుంటే ముఖానికి మేకప్ వేసుకోను.

అదే విధంగా షూటింగ్ అయ్యాక రాత్రిఎంత ఆలస్యంగా ఇంటికి వచ్చినా మేకప్ కడిగే పడుకుంటాను.చదువుకునే రోజుల్లో ఎక్కువగా చుడీదారులే ధరించేదాన్ని. నటిని అయిన తరువాత రకరకాల నా దుస్తులను చూసి స్నేహితురాలు ఆశ్చర్యపోతుంటారు. బయట కార్యక్రమాల్లో పాల్గొనేటప్పుడు చీరలు ధరించడానికే ఇష్టపడతాను. ఇంట్లో ఉంటే నా ఫేవరేట్ డ్రస్ టీషర్టు, జీన్స్ పాంటు. శారీరక కసరత్తులు చాలా అవసరం. నేను నిత్యం ఎక్సర్‌సైజులు చేస్తాను. స్విమ్మింగ్ అంటే చాలా ఇష్టం. చివరిగా యోగా చేస్తాను. ఇవీ నేను పాటించే బ్యూటీ టిప్స్...అంటుంది తమన్నా...

**రెబల్ క్వీన్ రెజీనా:**

ఈ మధ్య టాలీవుడ్‌లో మంచి సక్సెస్‌లను అందుకుంటూ నిర్మాతల దృష్టిని ఆకర్షిస్తోన్న యంగ్ భామ రెజీనా. ప్రస్తుతం కృష్ణవంశీ దర్శకత్వంలో నక్షత్రం అనే సినిమా చేస్తోంది. ఈ సినిమా ప్రస్తుతం సెట్స్‌పై ఉండగా, సందీప్ కిషన్ ఈ చిత్రంలో కథానాయకుడిగా నటిస్తున్నాడు. ఇక తాజాగా సెల్వరాఘవన్ దర్శకత్వంలో తెరకెక్కే రొమాంటిక్ థ్రిల్లర్‌లోను హీరోయిన్‌గా నటించే ఛాన్స్ అందుకుంది రెజీనా. ఇందులో దెయ్యంగా కనిపించనుందట ఈ యంగ్ భామ. ఇప్పటికే స్క్రీన్ టెస్ట్ కూడా పూర్తి కాగా త్వరలో రెజీనాకు సంబంధించిన సన్నివేశాలను తెరకెక్కించనున్నట్టు టాక్. ప్రముఖ దర్శకుడు గౌతమ్ మీనన్ నిర్మిస్తోన్న ఈ చిత్రంలో ఎస్.జె.సూర్య, నందిత ప్రధాన పాత్రలు పోషిస్తున్నారు. మరి ఈ చిత్రంతో అయిన రెజీనా ఫేట్ మారుతుందా, లేదా అనేది చూడాలి.

**టూ పీస్‌లో రెజీనా:**

ఎస్ఎమ్ఎస్ సినిమా ద్వారా తెలుగు తెరకు పరిచయమైన రెజీనా.. రారా కృష్ణయ్య సినిమాలో తప్ప మరే మూవీలో తన అందాలను ఎక్కువ ఆరబోయలేదు. లిప్‌లాక్ సీన్లలో నటిస్తోంది కానీ.. గ్లామర్‌ని మాత్రం ఎక్కువగా ఒలకబోయకుండా లిమిట్స్‌లోనే ఉండిపోయింది. అలాంటి ఈ అమ్మడు.. ఇప్పుడు ఏకంగా టూపీస్ బికినీ వేసుకోవడానికి రెడీ అయ్యిందని సమాచారం. కృష్ణవంశీ డైరక్షన్‌లో నక్షత్రం పేరిట ఓ సినిమా రూపొందనున్న విషయం తెలిసిందే. రీసెంట్‌గా పూజా కార్యక్రమాలు జరుపుకున్న ఈ మూవీలో సందీప్ కిషన్ కథానాయకుడిగా నటిస్తుండగా.. అతని సరసన హీరోయిన్‌గా రెజీనా నటిస్తోంది. ఇందులో ఓ సన్నివేశంలో బికినీ వేసుకోవాలని దర్శకుడు చెప్పగా.. రెజీనా వెంటనే అందుకు అంగీకారం తెలిపిందట. అంటే.. మునుపెన్నడూ లేని విధంగా ఈ అమ్మడు టూపీస్ బికినీలో తన అందాలను ఆరబోయనుందన్నమాట.

**దెయ్యం పాత్రలో వినూత్నంగా:**

తెలుగులో ఈమధ్యే వరుస సినిమాలతో స్టార్ హీరోయిన్‌గా ఎదుగుతోన్న రెజీనా, ఇప్పటివరకూ ఎక్కువగా గ్లామర్ పాత్రలతోనే మెప్పిస్తూ వచ్చారు. అయితే తాజాగా ఆమె తన కొత్త సినిమాలో ఓ సరికొత్త పాత్రలో, తన శైలికి భిన్నమైన పాత్రలో కనిపించనున్నట్లు తెలుస్తోంది. సెల్వ రాఘవన్ దర్శకత్వంలో తెరకెక్కే రొమాంటిక్ థ్రిల్లర్‌లో హీరోయిన్‌గా నటించనున్న రెజీనా, ఆ సినిమాలో ఓ దయ్యంగా కనిపించనున్నారట. ఇందుకోసం ఇప్పటికే రెజీనా లుక్ టెస్ట్ కూడా పూర్తి చేశారట. త్వరలోనే రెజీనా పార్ట్‌కు సంబంధించిన షూట్ మొదలవుతుంది.

ప్రముఖ దర్శకుడు గౌతమ్ మీనన్ నిర్మిస్తోన్న ఈ సినిమాలో ఎస్.జె.సూర్య, నందిత శ్వేత ఇతర ప్రధాన పాత్రల్లో నటిస్తున్నారు. కొద్దికాలం క్రితమే సెట్స్‌పైకి వెళ్ళిన ఈ సినిమాను గౌతమ్ మీనన్, సెల్వ రాఘవన్ సౌతిండియాలో ఓ కొత్త ప్రయోగంగా ప్రచారం చేస్తున్నారు. ఇక కొన్నాళ్ళుగా సరైన హిట్ లేక బాధపడుతోన్న సెల్వ రాఘవన్ ఈ సినిమాతో తన సత్తా చాటతారనే ప్రచారం జరుగుతోంది.

# బంగారు బతుకమ్మ ఉయ్యాలో

**తిరువనంతపురంలో ఓనం పండుగను నిర్వహిస్తున్నట్లుగానే వినూత్నంగా హైదరాబాద్‌లో బతుకమ్మ ఉత్సవాలను నిర్వహించాలని ప్రభుత్వం సంకల్పించింది. కేరళ మహిళలు కసవు చీరలు ధరించి ఓనం ఉత్సవాల్లో భాగస్వాము లు అవుతారు. అదే తరహాలో ఇక్కడ కూడా బతుకమ్మ పండుగలో పాల్గొనే మహిళలు తెలంగాణ విశిష్టతను చాటేవిధంగా ప్రత్యేక రంగుతో కూడిన చీరలను ధరించనున్నారు. వచ్చే నెల 6న 15 వేల మంది మహిళలతో ఒకే రంగు చీర ధరింప చేసి ఎల్‌బీ స్టేడియంలో ఉండచుట్టిన తాడు ఆకారంలో నిలబెట్టి గ్రాండ్ బతుకమ్మ పేరుతో సరికొత్త సాంస్కృతిక అంశాలు మేళవించి బతుకమ్మ ఉత్సవం నిర్వహించనున్నారు. కొందరు అధికారుల ఆలోచనలకు సీఎం కార్యాలయ అధికారులు ఆమోదం తెలినట్లు తెలిసిం ది. ఇందుకు సంబంధించిన వివరాలను అధికారులు ఒకట్రెండు రోజుల్లో వెల్లడించనున్నారు. వచ్చే నెల 9న మాత్రం ట్యాంక్‌బండ్‌పై బతుకమ్మ ఉత్సవాలు యథావిధిగా నిర్వహించనున్నారు. ఈ నెల 30వ తేదీ నుంచి తెలంగాణ వ్యాప్తంగా జరిగే బతుకమ్మ ఉత్సవాలపై ప్రత్యేక కథనం...**

రాష్ట్ర సర్కారు బతుకమ్మ పండుగను సరికొత్త పంథాలో ఆకర్షణీయంగా నిర్వహించ బోతుంది. గతేడాది కేటాయించిన రూ.10 కోట్ల బడ్జెట్‌ను ఈసారి సీఎం కేసీఆర్ రూ.15 కోట్లు పెంచి మంజూరు చేశారు. అందులో బతుకమ్మ పండుగ నిర్వహణకు ప్రతి జిల్లాకు రూ.10 లక్షలు కేటాయించారు. ప్రతి గ్రామంలో బతుకమ్మ పండుగ కళ కనపడేలా చేయనున్నారు. ఈ నెల 30 నుంచి తొమ్మిది రోజులపాటు ప్రభుత్వ ఆధ్వర్యంలో బతుకమ్మ ఉత్సవాలు జరగనున్నాయి.

**ఓనం పండుగకు ధీటుగా:**

కేరళీయుల గ్రామీణ పండుగ ఓనంను అక్కడి ప్రజలు పదిరోజులపాటు చూడముచ్చటగా జరుపుకొంటారు. ఈ పండుగను నేరుగా తిలకించేందుకు విదేశీయులు సైతం హాజరు అవుతారు. సర్కారు కూడా ఈసారి తిరువనంతపురంలో ఓనం పండుగ ఎలా నిర్వహిస్తారో అలాగే వినూత్నంగా హైదరాబాద్‌లో నిర్వహించాలని సంకల్పించింది. కేరళ మహిళలు 'కసవు చీరలు' ధరించి పండుగ ఉత్సవాల్లో భాగస్వాములు అవుతారు. అదే తరహాలో ఇక్కడ కూడా బతుకమ్మ పండుగలో మహిళలు తెలంగాణ విశిష్ఠతను యాది చేసే ప్రత్యేక రంగుతో కూడిన చీరను తీసుకురానున్నారు. అక్టోబర్ ఆరో తేదీన 15 వేలమంది మహిళలతో ఒకే రంగు చీర ధరింపచేసి ఎల్‌బీ స్టేడియంలో గ్రాండ్ బతుకమ్మ పేరుతో సరికొత్త సాంస్కృతిక అంశాలు మేళవించి బతుకమ్మ ఉత్సవం నిర్వహించనున్నారు. సర్కారులోని కొందరు అధికారుల ఆలోచనలను సీఎం కార్యాలయ అధికారులు కూడా ఆమోదం తెలినట్లు తెలిసింది. ఇందుకు సంబంధించిన వివరాలను సంబంధిత అధికారులు ఒకటి రెండు రోజుల్లో వెల్లడించనున్నారు. తొమ్మిదో తేదీన మాత్రం ట్యాంక్‌బండ్‌పై బతుకమ్మ ఉత్సవాలు యథావిధిగా నిర్వహించనున్నారు.

పూలపండుగను వినూత్నంగా నిర్వహించేందుకు సర్కార్ సమాయత్తమవుతోంది. కేరళ మహిళల మాదిరిగా ఈసారి బతుకమ్మ ఉత్సవాల్లో పాల్గొనే తెలంగాణ ఆడబిడ్డలు ప్రత్యేక రంగు చీరలతో ఆకట్టుకోనున్నారు. బతుకమ్మ ఉత్సవాల నిర్వహణకుగాను గతేడాది కేటాయించిన రూ.10 కోట్ల బడ్జెట్‌ను సీఎం కేసీఆర్ ఈసారి రూ.15 కోట్లకు పెంచారు. ప్రతి జిల్లాకు రూ.10 లక్షలు కేటాయించారు. తెలంగాణలోని ప్రతి గ్రామంలో బతుకమ్మ పండుగ కళ కనబడాలని, అందుకు కావాల్సిన ఏర్పాట్లు చేయాలని అధికారులను ఆదేశించారు. ఈ నెల 30 నుంచి తొమ్మిది రోజులపాటు ప్రభుత్వ ఆధ్వర్యంలో బతుకమ్మ ఉత్సవాలు జరగనున్నాయి. కేరళీయుల గ్రామీణ పండుగ ఓనంను అక్కడి ప్రజలు పదిరోజులపాటు చూడముచ్చటగా జరుపుకుంటారు.

**ప్రకృతి అందాల పూల పండగ:**

ఈ పండుగను నేరుగా తిలకించేందుకు విదేశీయులు సైతం హాజరవుతారు. తెలంగాణ ప్రాంతంలో యావన్మందీ భక్తి శ్రద్ధలతో జరుపుకునే పండుగ బతుకమ్మ. అశ్వయుజ మాస పాడ్యమి రోజున బతుకమ్మను నిలువుకుని నిత్యం సంధ్యాసమయంలో ఆటపాటలతో బతుకమ్మకు నీరాజనమర్పిస్తారు. ప్రకృతిసిద్ధమైన గునుగు పూలు, సొంపు పూలు, తోక చామంతి, చిట్టి చామంతి, గులమాల పూలు, తంగేడు పూలు, ఎర్ర గన్నేరు, పచ్చ గన్నేరు, బంతి పూలను సేకరించి ఒక పళ్లెంలో గుండ్రంగా అమరుస్తారు. వీటి అమరిక ఎంతో కళాత్మకంగా ఉంటుంది. రంగు రంగుల పూలను నేర్పుగా ఆకర్షణీయంగా తీర్చిదిద్దుతారు. ఆ పూల పేరువుపై పసుపు ముద్దను (గౌరీదేవిని) ఉంచి, దానిపై మట్టి ప్రమిదలో దీపాన్ని వెలిగిస్తారు. సద్దుల బతుకమ్మ రోజు (విజయ దశమి ముందునాడు) సమీపంలోని చెరువుల్లోనూ, కోనేరుల్లోనూ, తమ పెరటి బావుల్లోనూ వదిలిపెడతారు. అనంతరం జొన్న పిండి, బెల్లం, పల్లీలు, పెసరపప్పు, నెయ్యితో చేసిన మలీద, సత్తుపిండి వంటివి ప్రసాదంగా స్వీకరిస్తారు. బతుకమ్మ పండుగ చివరి రోజున సద్దుల బతుకమ్మ అడతారు.



**పురాణగాథ:**

ఈ పండుగ వెనుక పురాణగాథ కూడా ఒకటుంది. చోళరాజు ధర్మాంగదునికి వందమంది కుమారులు కలిగినా వారంతా యుద్ధంలో వీరమరణం పొందుతారు. చాలాకాలం తర్వాత లక్ష్మీదేవి అనుగ్రహంతో వారికి ఆడపిల్ల పుడుతుంది. నిండు నూరేళ్లు బతుకమ్మా అని ఆ శిశువును అందరూ ఆశీర్వదిస్తారు. నాటినుంచి బతుకమ్మను లక్ష్మి స్వరూపంగా పూలతో అలంకరించి పండుగ చేసుకోవడం ఆచారంగా మారింది. కాకతీయ రాణి రుద్రమ దేవి తమ మనవలకు అనారోగ్యం సోకినప్పుడు బతుకమ్మ పండుగను జరిపించిందని చెబుతారు. వెయ్యేళ్లకు పైగా సజీవంగా సాగుతున్న ప్రజా పండుగ బతుకమ్మ.

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రములోని తెలంగాణా ప్రాంతములో ఆశ్వయుజ మాస శుద్ధ పాడ్యమి నుండి తొమ్మిది రోజుల పాటు జరువుకుంటారు. ఈ బతుకమ్మ (గౌరి) పండగ లేదా సద్దుల పండుగ దసరాకి రెండు రోజుల ముందు వస్తుంది.

**బతుకమ్మ పండుగ విశిష్టత:**

సెప్టెంబరు, అక్టోబరు నెలలు తెలంగాణా ప్రజలకు పండుగల నెలలు. ఈ నెలలలో రెండు పెద్ద పండుగలు జరపబడతాయి. ఈ పండుగలకు కనీసం పదిహేను రోజులు అటువైపు, ఇటువైపు అంతా పండుగ సంరంభాలు, కుటుంబ కోలాహలాలు, కలయికలతో నిండిపోయుంటుంది. ఈ పండుగలలో ఒకటి బతుకమ్మ పండుగ, మరియొకటి దసరా (విజయ దశమి). అయితే బతుకమ్మ పండుగ మాత్రం, తెలంగాణకు మాత్రమే ప్రత్యేకమయిన పండుగ. తెలంగాణ సాంస్కృతిక ప్రతీక ఈ పండుగ. ఇతర చోట్ల పూలు, నీళ్లతో జరుపుకునే పండుగలు ఎన్ని ఉన్నా, అవి ఏవీ కూడా బతుకమ్మ పండుగతో సరిపోజాలవు.

ఈ పండుగ వర్షాకాలవు చివరిలో, శీతాకాలపు తొలి రోజులలో వస్తుంది. అప్పటికే వర్షాల వలన చెరువలన్నీ మంచి నీటితో నిండి ఉంటాయి. రకరకాల పువ్వులు రంగు రంగులలో ఆరుబయలలో పూసి ఉంటాయి. వీటిలో గునుక పూలు, తంగేడి పూలు బాగా ఎక్కువగా పూస్తాయి. బంతి, చేమంతి, నంది వర్ధనం లాంటి పూలకు కూడా ఇదే సమయం. సీతాఫలాలు (శిల్పక్క పండ్లు అంటారు) కూడా ఈ సమయంలో ఒక పెద్ద ఆకర్షణ. సీతాఫలాన్ని పేదవాని ఆపిల్ అంటారనేది తెలిసినదే. అలాగే జొన్న పంట కోతకు సిద్ధంగా తలలూపుతూ ఉంటుంది. వీటన్నింటి నేపథ్యంలో తెలంగాణ ఆడపడుచులు ప్రకృతి సౌందర్యాన్ని అద్భుతమయిన రంగురంగుల పువ్వులతో కీరిస్తూ బతుకమ్మ పండుగను జరుపుకుంటారు.

**పండుగ సంబరాలు:**

ఈ పండుగ సద్దుల బతుకమ్మ (బతుకమ్మ చివరి రోజు మరియు దసరాకు రెండు రోజుల ముందర) రోజుకు ఒక వారం ముందు మొదలవుతుంది. ఈ రోజుల్లో ఆడపడుచులు అందరూ అత్తవారింటి నుంచి కన్నవారింటికి చేరుకుని స్వేచ్ఛావాయువులు పీలుస్తూ ఈ పూల పండుగ జరుపుకోవటానికి తయారవుతారు. ఈ వారం రోజులలో వీరు రోజూ చిన్న బతుకమ్మలు చేసి, ప్రతీ సాయంత్రం దాని చుట్టూ తిరుగుతూ ఆడుతారు. ఆ తరువాత దగ్గరలో ఉన్న జలాలలో నిమజ్జనం చేస్తారు.

అయితే చివరి రోజు అత్యంత మనోహరంగా ఉంటుంది. ఆ రోజు మగవారంతా పచ్చిక బయళ్ళలోనికి పోయి తంగేడి, గునుక పూలను భారీగా ఏరుకుని వస్తారు. ఆ తరువాత ఇంటిల్లిపాదీ కూర్చుని ఆ గునగ పూలు, తంగేడు, కలువ, మరియు ఇతర రకాల పూలతో బతుకమ్మని తయారు చేస్తారు. ఇందులో గునగ పూలు మరియు తంగెడు పూలు ముఖ్య భూమికను పోషిస్తాయి.

ఈ పూలని జాగ్రత్తగా ఒక రాగి పళ్ళెం (తాంబలం)లో వలయాకారంగా, రంగులు మార్చుకుంటూ పేరుస్తారు. ముందుగా తంగెడు ఆకులు, పూలు పళ్లెంలో లేదా తాంబోలంలో పేర్చుతారు, ఆపై తంగేడు పూలతో కట్టలుగా కట్టిన కట్టలను చివరలు కోసి రంగులతో అద్దిన వాటిని పేర్చుతారు. మధ్య మధ్యలో ఇతర రకాల పూలను ఉపయోగిస్తారు. ఈ అమరిక ఎంత పెద్దదిగా ఉంటే అంత అందంగా ఉంటుంది. తెల్లని గునుక పూలను రంగులతో అద్ది, మధ్యలో తంగేడి పూలను పెడతారు. పేర్చడం అయ్యాక పైన పసుపుతో చేసిన గౌరి మాతను పెట్టి చుట్టు దీపాలతో అలంకరిస్తారు. దీనిని గృహంలో దైవ స్థానంలో అమర్చి పూజిస్తారు. ఇలా తయారు చేసిన బతకమ్మల చుట్టూ తిరుగుతూ పాటలతో గౌరి దేవిని కీర్తిస్తూ ఆడవారు పాడుతారు. ఆడవారు వారికి ఉన్న అన్ని రకాల ఆభరణాలను దరించి కొత్త బట్టలు కట్టుకుంటారు. ఇలా చాలా సేపు ఆడాక మగవారు వాటిని చెరువులో నిమజ్జనం చేస్తారు. ఆపై ఆ పళ్లెంలో తెచ్చిన నీటితో ఆడవారు వాయినమమ్మా వాయినం అంటూ వాయినాలు ఇచ్చి పుచ్చుకుంటారు. ఆపై ఇంటి నుండి తీసుకువచ్చిన పెరుగన్నం మరియు సత్తుపిండి( మొక్కజొన్నలు, లేదా వేరుశనగ లేదా పెసర విత్తనాలను దోరగ వేయించి వాటిని పిండి చేసి వాటితో చక్కెర పిండి లేదా బెల్లం మరియు నెయ్యి తగినంత కలిపి తయారు చేస్తారు)లను ఇచ్చి పుచ్చుకొని తింటారు

చివరి రోజు సాయంత్రం, ఆడపడుచులు అందరూ చక్కగా దుస్తులు, అభరణాలు ధరించి బతుకమ్మను వాకిలిలో పెడతారు. చుట్టుపక్కల ఉన్న వారు కూడా వారి బతుకమ్మలను ఇదే విధంగా అమర్చి వాటి చుట్టూ పెద్ద వలయాకారంలో చేరుతారు. ఐక్యత, సోదరభావం, ప్రేమను కలపి రంగరిస్తూ మానవ హారం ఏర్పరిచి పాటలు పాడుతారు. ఒకరు ముందుగా పాట మొదలుపెడితే మిగిలినవారు వారితో గొంతు కలుపుతూ పాడుతారు. ఈ జానపద గీతాలు చుట్టు పక్కలా ప్రతిధ్వనిస్తూ ప్రత్యేకమైన తెలంగాణా సంస్కృతిని ఆవిష్కరిస్తాయి.



**జనం మెచ్చిన జానపదాలు:**

చీకటి పడుతుంది అనగా,స్త్రీలందరూ ఈ బతుకమ్మలను తలపై పెట్టుకుని ఊరిలో ఉన్న పెద్ద చెరువు గానీ, తటాకంవైపు గానీ ఊరేగింపుగా బయలుదేరుతారు. ఈ ఊరేగింపు అందంగా అలంకిరించుకున్న స్త్రీలు, బతుకమ్మలతో అత్యంత సుందరంగా, వైభాయమానంగా ఉంటుంది. ఈ ఊరేగింపు కొనసాగినంత సేపూ, జానపద గీతాలతో వీధులు మారుమోగుతాయి. జలాశయం చేరుకున్న తరువాత, మెల్లగా బతుకమ్మలను పాటలు పాడుతూ,ఆడుతూ నీటిలో జారవిడుస్తారు. ఆ తరువాత మలీద (చక్కెర మరియు రొట్టెతో చేసినది) అనే పిండి వంటకాన్ని బంధు మిత్రులకు పంచిపెడతారు. ఆ తరువాత ఖాళీ తాంబలంతో పాడుతూ, బతుకమ్మను కీర్తిస్తూ ఇంటికి చేరుతారు. ఈ వారం రోజులూ,ఈ పాటలన్నీ అర్ధరాత్రి వరకూ వీధులలో మారు మ్రోగుతూనే ఉంటాయి.

బతుకమ్మ పండుగ కథలు ఈ బతుకమ్మ పండుగ వెనుక చాల కథలు ఉన్నాయి. బాగా ప్రాచుర్యంలో ఉన్నది ఒకటుంది... ఒక బాలిక భూస్వాముల ఆకృత్యాలను భరించలేక ఆత్మహత్య చేసుకుంటే, ఆమెను ఆ ఊరి ప్రజలు చిరకాలం బతుకమ్మా ! అని దీవించారంట అందుకనే ఈ పండుగ స్త్రీలకు సంబంధించిన, బతుకమ్మను కీర్తిస్తూ జరుపుకునే పండుగ. స్త్రీలందరూ ఈ సందర్భంగా వారు ఎటువంటి ఆపదల పాలు కారాదనీ, పతులు మరియు కుటుంబం చల్లగా ఉండాలనీ గౌరమ్మను ప్రార్థిస్తారు.

ఇంకొక వృత్తాంతములో దక్షిణ భారతాన్ని పాలించిన చోళ వంశ చక్రవర్తి ధర్మాంగదుడు సంతానము లేక అనేక పూజలు పునస్కారాలు చేయగా ఈయన భార్య గర్భవతియై లక్ష్మీ దేవి అనుగ్రహముతో ఒక కూతుర్ని కన్నది.

**బతుకమ్మ పండుగ కథలు:**

ఈ బతుకమ్మ పండుగ వెనుక చాల కథలు ఉన్నాయి. బాగా ప్రాచుర్యంలో ఉన్నది ఒకటుంది... ఒక బాలిక భూస్వాముల ఆకృత్యాలను భరించలేక ఆత్మహత్య చేసుకుంటే, ఆమెను ఆ ఊరి ప్రజలు చిరకాలం బతుకమ్మా ! అని దీవించారంట అందుకనే ఈ పండుగ స్త్రీలకు సంబంధించిన, బతుకమ్మను కీర్తిస్తూ జరుపుకునే పండుగ. స్త్రీలందరూ ఈ సందర్భంగా వారు ఎటువంటి ఆపదల పాలు కారాదనీ, పతులు మరియు కుటుంబం చల్లగా ఉండాలనీ గౌరమ్మను ప్రార్థిస్తారు.

ఇంకొక వృత్తాంతములో దక్షిణ భారతాన్ని పాలించిన చోళ వంశ చక్రవర్తి ధర్మాంగదుడు సంతానము లేక అనేక పూజలు పునస్కారాలు చేయగా ఈయన భార్య గర్భవతియై లక్ష్మీ దేవి అనుగ్రహముతో ఒక కూతుర్ని కన్నది. పసిబిడ్డైన లక్ష్మి అనేక గండములను గట్టెక్కినది కావున ఈమె తల్లితండ్రులు బతుకమ్మా అని నామకరణము చేసినారు. అప్పటినుండి యువతులు మంచి భర్తను ప్రసాదించాలని కోరుతూ బతుకమ్మను కొలవడం ఆనవాయితీ అయ్యిందని ఈ కథ చెబుతున్నది.

బతుకమ్మ పండుగ ప్రకృతిని అరాధించే పెద్ద పండుగ. పూలు బాగా వికసించే కాలంలో, జలవనరులు సమృాఎద్ధిగా పొంగి పొరలే సమయంలో బతుకమ్మ పండుగ వచ్చి, భూమితో, జలంతో, మానవ అనుబంధాన్ని సంబరంగా జరుపుకోబడుతుంది. ఈ సంబరాలు జరుపుకునే వారం అంతటా స్త్రీలు బొడ్డెమ్మ (మట్టితో చేసే దుర్గాదేవి బొమ్మ) ను బతుకమ్మతో పాటూ చేసి నిమజ్జనం చేస్తారు.

**పది దేశాలలో సంబరాలు:**

ఈసారి పది దేశాల్లో బతుకమ్మ పండుగను నిర్వహించనున్నట్టు నిజామాబాద్ ఎంపీ, జాగృతి వ్యవస్థాపక అధ్యక్షురాలు కల్వకుంట్ల కవిత ప్రకటించారు. ప్రతి ఏటా మాదిరిగానే ఈఏడాది కూడా రాష్ట్రవ్యాప్తంగా అన్ని నియోజకవర్గ, మండల, గ్రామాల్లో జాగృతి ఆధ్వర్యంలో బంగారు బతుకమ్మ ఉత్సవాలను నిర్వహించనున్నట్లు తెలిపారు. తెలంగాణ వచ్చిన తర్వాత బతుకమ్మ ఎందుకని చాలా మంది అన్నారని, కానీ ఇప్పుడే బతుకమ్మ ఉత్సవాల నిర్వాహణ ఎంతో అవసరం ఉందని అన్నారు. తెలంగాణ భవన్‌లో బంగారు బతుకమ్మ పోస్టర్, పాటల పుస్తకం, సీడీని ఆమె ఇటీవలే ఆవిష్కరించారు. ఈ సందర్భంగా కవిత మాట్లాడుతూ తెలంగాణ సంస్కృతి భవిష్యత్తు తరాలకు తెలియాలంటే బతుకమ్మను ప్రతీ ఏడాది ఘనంగా నిర్వహించుకోవాలన్నారు. బతుకమ్మ పాటల్లో తెలంగాణ ప్రజల బ్రతుకులు ఇమిడి ఉంటాయని, ఎలాంటి విషయాన్నయినా సున్నితంగా వివరించేందుకు ఈ పాటలు ఎంతో చక్కగా ఉపయోగపడుతాయన్నారు. గతంలో బతుకమ్మ ఆడాలంటే కొంత మంది మొహమాట పడేవారన్నారు. కానీ తెలంగాణ వచ్చిన తర్వాత ప్రతీ ఒక్కరూ ధైర్యంగా బతుకమ్మను ఆడుతున్నారని కవిత తెలిపారు. బతుకమ్మను ఆడటం ద్వారా తమ సంస్కృతిని కాపాడుకున్న వాళ్లమవుతామని పేర్కొన్నారు. మన సంస్కృతి మనమే సైనికులమవుతామన్నారు. మాతృభాషలో మాట్లాడితేనే మనకెక్కుతుందని, తెలంగాణ భాష, సంస్కృతి బతుకమ్మ పాటల్లో స్పష్టంగా కనిపిస్తుందన్నారు. తెలంగాణ సంస్కృతి, బతుకమ్మ పండుగను ప్రపంచానికి పరిచయం చేసిన తెలంగాణ జాగృతిపై ప్రముఖ కవి నందిని సిధారెడ్డి ప్రశంసలు కురిపించారు. పల్లెటూరి సంస్కృతిని తెలంగాణ జాగృతి పట్టణాలకు తీసుకొచ్చిందన్నారు. బతుకమ్మ పాటలపై పక్క రాష్ట్ర ప్రజలు ఆసక్తి చూపిస్తున్నారన్నారు. రాయలసీమ ప్రజలు బతుకమ్మ పాటలపై ఎంతో ఆసక్తి చూపిస్తున్నారని ఆయన పేర్కొన్నారు. బతుకమ్మ పండుగను విదేశాలకు వ్యాప్తి చేసిన ఘనత తెలంగాణ జాగృతికే దక్కుతుందని ప్రముఖ గాయకుడు దేశపతి శ్రీనివాస్ అన్నారు.





# వింతలు- విడ్డూరాలు



మిక్కీమౌస్, మిన్నీమౌస్ పాత్రలకు తమ గొంతు అరువిచ్చిన డబ్బింగ్ కళాకారులిద్దరూ నిజజీవితంలోనూ పెళ్లిచేసుకున్నారు.



* డ్రమ్ ఫిష్ అనే చేపలు అచ్చం డ్రమ్ వాయించినట్టుగా చప్పుడు చేస్తాయి. ఆ చప్పుడు **50 అడుగుల** దూరం దాకా వినిపిస్తుంది!

పావురం ఎముకల బరువు కన్నా ఈకల బరువే ఎక్కువ





డాల్ఫిన్లు నీటిపై 20 అడుగుల వరకు ఎగరగలవు.



మగవాళ్లను Dude అంటే ఆడవాళ్లను Dudine అనాలట!





*పాలరాతితో దుస్తులు - Dresses with Marble*

థామ్సన్ పాలరాతి కళాకారుడు... అయితే అందమైన శిల్పాలు చెక్కుతాడనుకోకండి... మరేం చేస్తాడు? పాలరాయి దుస్తులు చేయడం ఇతని ప్రత్యేకత! తెల్లగా మెరిసిపోతూ కనిపించే ఈ దుస్తుల్ని చూస్తే భలేగా ఉన్నాయనిపిస్తోంది కదూ! కానీ వీటిని తొడుక్కోలేం. ఎందుకంటే ఇవి నిజమైన డ్రెస్సులు కావు. రాతితో చేసినవి. అవును థామ్సన్ అనే కళాకారుడు చెక్కిన కళాకృతులు. ఇప్పుడితగాడు తన నైపుణ్యంతో ప్రముఖుడైపోయాడు.

* స్కాట్లాండ్‌కు చెందిన థామ్సన్ పాలరాతితో అద్భుతమైన దుస్తులు చెక్కుతున్నాడు. రకరకాల డిజైన్లలో తీర్చిదిద్దుతాడు. నిజమైన డ్రెస్సులకు చేసినట్టే వీటికి కర్వింగ్ చేయడం, టీషర్టులకు కాలర్ మలవడం, బటన్లు పెట్టడం లాంటివి చేస్తూ అచ్చం మనం వేసుకునే దుస్తుల్లానే మలుస్తున్నాడు. షూస్, టోపీల లాంటివి కూడా అద్భుతంగా చెక్కుతాడు. దూరం నుంచే చూస్తే నిజమైనవే అనే భ్రమ కలిగించేలా ఉంటాయి. దగ్గరి కెళ్లి, ముట్టుకుంటేగానీ తెలీదు అవి చలువరాతివని.

* ఇలా ఇప్పటి వరకు ఎన్నో టీషర్ట్స్, గౌన్లు పాలరాతితో రూపొందించాడు. తన అరుదైన ఈ కళాకృతులకు 'ఐడెంటిఫై కలెక్షన్'గా పేరు కూడా పెట్టుకున్నాడు.

* వీటిని లండన్, న్యూయార్క్ వంటి ఎన్నో నగరాల్లో ప్రదర్శనకు ఉంచాడు. త్వరలో హాంకాంగ్‌లో ప్రదర్శన పెట్టనున్నాడు. ఇప్పటికే బోలెడు అవార్డులు కూడా దక్కాయి.

* ఇంతకీ ఇతనికి ఈ కళా నైపుణ్యం ఎలా అబ్బింది? 32 ఏళ్ల థామ్సన్ 'ఎడిన్ బర్గ్ విశ్వవిద్యాలయం'లోని (హిస్టరీ ఆఫ్ ఆర్ట్) కళా చరిత్రలో పట్టా పొందాడు. తర్వాత కొంత కాలం అమెరికన్ కంపెనీలో శిల్పిగా పనిచేశాడు. దుస్తులు తయారు చేయడంలో తనకున్న ఆసక్తిని విభిన్నంగా చూపించాలనుకున్నాడు. దాంతో పాలరాతితోనే ఇలా వివిధ రకాల డ్రెస్సులు తయారు చేయడం మొదలుపెట్టాడు. ఆదరణ పెరగడంతో వీటిలోనే సరికొత్తగా, నిజమైన ఫ్యాన్సీ దుస్తులకు దీటుగా చేస్తూ అందర్నీ ఆకట్టుకుంటున్నాడు.



డిస్నీ వాళ్లు తీసిన సినిమాల్లో ఇంతవరకూ సృష్టించిన యువరాణి పాత్రల సంఖ్య 9. వాటి పేర్లు వరసగా... జాస్మిన్, స్నోవైట్, ఫా ములాన్, అరోరా, సిండ్రెల్లా, పోకహోంటాస్, టియానా, బెల్లే, ఏరియల్.



బ్రాచియోసారస్ డైనో ఏకంగా 17 ఆఫ్రికా ఏనుగులంత బరువు ఉండేది!

## మరుగుజ్జు పిల్లి

ప్రపంచవ్యాప్తంగా ఉన్న 5 కోట్ల పిల్లుల్లో ఫిజ్‌గర్ల్ అనే పిల్లి మరుగుజ్జు పిల్లి. అమెరికాలోని కాలిఫోర్నియాలో ఉంది. ఇది కేవలం ఆరు అంగుళాల పొడవు. రెండు కిలోల బరువుంటుంది. గిన్నిస్ రికార్డులో స్థానం సంపాదించుకుంది. ఈ పిల్లి జాతిని ముంచికిన్ క్యాట్ అంటారు.

*Dwarf Cat - మరుగుజ్జు పిల్లి*



తనకి తాను యజమాని కాలేని మనిషి ఎన్నటికీ స్వతంత్రుడు కాలేడు - ఎపిక్టిటస్

కథ

గోదావరి తీరం కథలు

# విధి బలీయం

చర్చంద్రా! ఝేరియకవ్వంన్నెనిఛ్చ
నర్సా...ఉయంస్యాల్లో ఎలరిఅ ఫ్లైర్తి
న్చుంది. బఖఖీలు అర్సీర్వాతర్సి
ఉతర్సుక్కుఎర్సీచర్సీఅ ఎమ్మ ధఛన్ని
కారిస్త చర్సీంకంంవ్వారియకంయని
ఊంరొక్కబవినిఖఖీ...అనఛ్ఛుప్పు రింర్స్వతర్తీఎర్సీరావర్సు.
అయవిన్యూ! ఎర్సీరిస్తునఛ్ఛ! ఎమ్మఎషకంంగ్లప్ప...ఖిలనిలిన్స్ బ్లక్స్ససలో వీఏఖిలనిఖీ తీరియ
కశీచిఅ ఇచ్చఅన్లెనర్సీ...అంఖా అర్సీల్ల చ్వాతర్సీలు చీంరా చ్వాంగంంయకంయ
అర్సీగ్లన్పుచర్సీకంయంఖా చర్సీక్కా ఎర్సీచిఅంది చర్సీంద్రధఎర్సీతి.
ఆవ్వ అతర్సీని దిల్లగంగ్గరికశీచిఅ న్వాలచర్సీరావులు చర్సీరారిస్తూ నిలబఛ్లంది.
ఊయంసిల్లో లిఎల్ల క్వంరా ఎర్సీంది. చర్సీంఖిలనిదిఛన్ని చర్సీంకంంవ్వారియకశీచిఅ..
కారిస్త దీనవ్వతర్సీస్తుక్కఎర్సీంది. బ్లక్స్ససలో ఖిలనిలిన్స్ వీఏఖిలనిఖీ తీరియకశీచిఅ ఇద్దర
ఎర్సీని రింరరొర్స్వతర్తీఎర్సీరావర్సు ఆంవ్వాల్ల అవర్సీృతర్సీఎర్సీల్లి రిఎలిఎబి
గంస్సనర్సీ ఎర్సీయద్దల్లప్ప. ఎలరిఎ నర్సీఎర్సీవ్వతర్సీ క్వారింతర్సీలు కశీగ్సతర్సీ
ఎరిఛ్చ్ర్ల అర్సీల్లశీఎలింయద్ధ అర్సీంగ్రల్ల ఎప్లోలఅంకంఎషయంస్యాప్ప. ...ఆలిఎ
భంన్గ్లెంఛఛ! అనఛ్ఛుప్పు. చర్సీంద్రధఎర్సీతి అకంంక్గలకశీరిస్తూ..ఏఎర్సీ
ర్యూయంధిల్లర్సీ!...అంది.
ఏమిఖిలఎ గంగ్గబ్గగ్గార్‌ను! మీ నధనర్సీగారి బఖఖీలఎ దశీరికాయంసా! అంఖా
కంయాతర్సీర్ని ఎర్సీయధ్వఖఖీకంయని ఎలరిఎని తీరియకఎమ్మ ఊయంసిల్లో
రిఎంరొర్స్గబవినిఖిలనిఖీ బీంరాంఎధిలోది ఎర్సీర్య ఊతర్సీ తీలిఎ భంనిర్తకంయ
ఎకలన్య బకఎక్స్లని అంధ్యులో ఎర్సీయంచింది. ఎలఎల ఆవ్వ చర్సీంకంంలోంచి
బ్యాంక్‌నలోకలఎ ఎర్సీంగింది. అంత్య ఆవ్వ శరీరింరా రిఏఖఖీ ఎర్సీదిలఎనిలిఎ
నర్సీఖివిన్ని అర్సీనర్సీ ఎవ్వనర్సీకలీన్య, లిఎల్ల ఎర్సీయందిల్లకంయ రిఛ్ఛ్పఎఎర్సీన్గం ఊరి
గింది. ఆవ్వ అర్సీక్షంంణఅంం రిస్పురివాని కృల్పోరాంది. అల్ల ఎన్ని క్షంంణ్ణాలు
దశీర్లిఎఎయంసాయివిసా!
ఎర్సీయధ్యరివాన్నిం ఒంఖిలఎగింంఖనర్సీంరాకంయ అవ్వరావర్సీ వీసైకలంల్‌ని
బవినిల్‌ని గంంణనిగంంణని ఎవ్వాగిరిస్తూ ...వీసంద్రప్పఎర్సీమ్మగ్గంరా..వీసంద్రప్ప
ఎర్సీమ్మగ్గంరా ఎలలు అంఖా లిఎలిచఛ్ఛప్ప. ఎంతర్సీ లిఎలిచిందిఅ ఊఎధబు
శరీసానర్సీయం..రిఎఎర్సీఛాధనర్సీం రాకంంఎషఎర్సీప్పంత్య వీసైకలంల్‌ని నలఖీర్స్
ఎవ్వలిఎ అర్సీలురివులు త్యలిఎ లోనికశీచఛల్లప్ప. చర్సీంద్రధఎర్సీతి న్వాలమీదిప్ప
అచ్చతర్సీనర్సీగా రిఛ్లప్పఎర్సీంది. రిఎలిఎబ్లిల్లో అవర్సీృతర్సీ శరీనఎర్సీంగా
బ్యాంక్‌నలో త్వాలుతర్సీా ఉంది. అవ్వరావర్సీకంయ భశనప్లంవాత్తిఎషరాంది.
ఆ ఇంఖిలఎ చర్సీఖఖీరిఎకంంక్గల ఎఛ్ఛన్లెనర్సీ లిఎలిచి ఆ దిప్పశరీర్యం
చర్సీహాలిఎంచఛ్ఛప్ప. అంద్యంరా రిఎలిఎదిఛని శరీనఎధన్ని, ఆవ్వనర్సీ
చర్సీహాలిఎ నిర్వాంతర్సీఎషఎయంసాంరా. రింర్స్వతర్సీఎర్సీరావర్సీ రిఎనిచ్వుశీఎ
ఝేరియకంయ రొవర్సీన్ని కంంబయంవాళ్లిఖీరా. అతర్సీగ్గాల్ప విరిషయంసింం విని
నర్సీఎర్సీలలఎనెనర్సీఖఖీగా అశీందిప్పంరాగా..భ్స్ప లిఎ ఎల్‌నె వీఎఖఖీకంయని
వీసైకలంల్‌ని ఆశీకంయ్యకంయంఖా ఎర్సీచఛల్లప్ప.
ఇంఖ్లో అల్గాంంయ వీఎఖిలఎఖీరిర్సప్వఖిలనిక్కం అవర్సీృతర్సీఎర్సీల్లి శరీనఎధన్ని
బ్యాంక్‌నలోంచి క్రలంంది్పకలఎ తీలిఎ న్వాలమీదిప్ప బఖఖీ రిరిచి రిఛ్లప్పుక్క
అందించింది. రింర్స్వతర్తీఎర్సీరావర్సు బఖఖీలు ఎర్సీవాంరొఅకంయని ఖిలనిలిన్స్
బ్లక్స్ప తీరియకంయని వీసైకలంల్‌ని ఎక్కాప్ప. చర్సీంద్రధఎర్సీతి భంనిర్తకలఎ ఎదిప్ప
ంశీచిఅంది. అతర్సీగ్గాల్ప కారిస్త దిప్పూంరా ఎవ్వల్సెగాన్వ ఏర్య ఫ్లఖిలఎకంం
ఎర్సీచిఅనర్సీఖివిన్లఖీ...ఏఎర్సీగ్గర్సీ నిలయంసింకాల ఆఖిలఎనర్సీగ్గల ఎర్సీచ్వఖ
రిఛ్లప్ప ఎలరిఎకంయ అవర్సీయాల్‌నక్రిస్స్ప గ్నఛ్ఛ తీరియకంంరొగ్గల! ప్రాధిస్త
ఖ్గంచ్ప ఎవ్వబుధఎర్సీంకంఖిలఎ గంంఎంర్గాలఎనెకంంఎషరాంది. ఎర్సీరిఅఎంరా
కంంఛ! అంది...
అల్లగ్యఎ అంఖా రింర్స్వతర్తీఎర్సీరావర్సు ఎమ్మఎషయంస్యాప్ప.
రిఎనఎఛ్ఛర్లప్ప గంంఖలయశన్యఎర్సీంరాకంయ బఖఖీలు ఉతర్సీక్కుఎర్సీల్లప్ప
కాకంంర్ఘ ఆ రిఏనీ ఈ రిఏనీ కంచ్చఛ రిపూర్తి చ్పలిఎంది. బఖఖీలు దిప్పగ్గఛనర్సీ
ఆంరొవ్వలిఎ ఎలరిఎకంయ న్సీంన్లప్ప ఎఛద్దఎర్సీని బ్లరాబులరాలో న్సీంన్లప్ప తీరియ
కవ్వ బ్లత్రర్సీర్సాన్‌లో గంంల బకఎక్స్లో ఎషలిఎ ఎర్సీర్య బకఎఖ్‌నెత్య ఎలరిఎనర్సీ
తీరియకంయని రిఎబ్బ, చ్వాంబు, ఖఎర్సీల్‌నె అకంంక్గ వీఏఖిలనిఖీ చర్సీన్సీయప్ప తీరియ
కశీద్దఎర్సీని, ఎధఖరా నిఖఖీరా చ్వలిఎ బ్యాంక్‌నఎ దిప్పగ్గంరొంరాకంయ బయింసిలఛ్ఛ
రింది.
లిఎల్లని నెల్లనర్సీం చ్వారాయరిస్తుంఖిలఎ ఎఎర్సీంఛాధ లోనికశీలెంరాని వీధి
అర్సీలురివ ఒంగాగా ఎవ్వలిఎ ఎర్సీచిఅంది. ఎందిప్పకంంన్య అవ్వకంయ విరివరీ
అర్సీఎవ్వనర్సీ నీంరొలింం ఆవర్సీలివాంచించిర్సీళ్లరాంది. అరాయంధ ఎలరిఎవ్వ
అర్సీకంయని అల్లగ్యఎ బ్యాంక్‌నఎ దిప్పగ్గంరొంరాకంయ ఎమ్మంది. బ్యాంక్‌నఎ కారిస్త
ఎతర్సీగా కంంఖల్లప్పంత్య రొవర్సీప్పు ఎవ్వఖివిన్లకలన్గంది. ఎర్సీయ్య ఎవ్వఖఖీ కంచ్చఛ
బవినిల్లిఖీరా. రింర్స్వతర్తీఎర్సీరావర్సు...ఆయవిన్యూ..చిఖిలనిఖీతర్సీల్లీ! నీకంంరిన్స్వ
నర్సీహార్యాన్లప్ప నిర్లప్పఎషయంసాయంసా అవర్సీమ్మా! అంఖా బ్లవర్సీయంరొవర్సీ
నఛ్ఛుప్ప. బ్లంర్యా దిప్పగ్గంరొంరాకంయ ఎమ్మ ఆవ్వనర్సీ అర్సీన్గంతర్సీా...చర్సీంద్రధ
ఏఎర్సీరాయ్యంది? ఎర్సీల్ల లిఖ్స్ని గానీ రాలఅంది్ప గంంది! అంఖా
క్రవశ్సించఛ్ఛప్ప. అవర్సీమ్మా!
అద్వానర్సీల్లి! ఎర్సీల్ల ఎర్సీచిఅరిఛ్లంది. ఎలరిఎనర్సీ చర్సీంకంంవ్వారియకంయని
బకఎఖ్‌నలో న్సీంన్లప్ప ఎర్సీయంచర్సీబోతర్సీగ్గంగా...అంది. ఆవ్వ ఎర్సీర్సాఖలు
నర్సీంతిలోంచి ఎర్సీరిస్తునర్సీఖ్లగా రినర్సీగా ఉన్నారు. అరిఎలు విరిషయంసింం
బ్లంర్యాకంయ అవ్వలియసిదిప్పనిలిఎంచింది రింర్స్వతర్తీఎర్సీరావర్సీకలఎ.
కంన్లప్ప అవ్వరిచి నెవ్వఎర్సీమ్మదిగా లఅచి
కంంరొరొంఖా ఊనఛన్ని చర్సీహాలిఎ రిఛ్లప్ప
కంంనర్సీ అవర్సీృతర్సీనర్సీ చర్సీహాలిఎ లిఎచిఅ
ధఛనిల్ల క్వంకంంఎప్వలిఎ ఏఎర్సీల్లి? ఎలరిఎక్కం
ఎర్సీరాయ్యంధిల్లర్సీ? అంఖా బోంరొనర్సీ ఫ్లైర్తి
నలగింది...
చర్సీంద్రా! ఊంరొక్క! ఎలరిఎకలీఎ..ఎర్సీ
నర్సీకంంహా న్వాలనెత్య రొహాణంం తీరిఎష
రాంది...అనఛ్ఛుప్పు రింర్స్వతర్తీఎర్సీరావర్సు
చర్సీంద్రధఎర్సీతిని గంంర్గప్వలకంయ రివాతర్సీ
కంంఖా...

–డా. మంతెన సూర్యనారాయణ రాజు

## రామయ్య పొలం కొడుకులు ఎలా పంచుకొన్నారు?

రామయ్య 52 ఎకరాల పొలం ను, రాము సోము సూరి కొడుకులకు పంచారు. రాము పొలం, సోము 2/3 సమానం, సూరి పొలం రాము మరియు సోము పొలాలకి 1.6 రెట్లు ఎక్కువ. అయితే రామయ్య పొలం ముగ్గురు కొడుకులు ఎలా పంచుకొన్నారు?

చామర్తి పజిల్స్

చామర్తి వెంకట రామ కృష్ణ
-201 మర్కజ్ మర్యాద అపార్ట్మెంట్స్
అడిక్మెట్, హైదరాబాద్ 500044

జవాబు: రాము 12, సోము 8 సూరి 32 ఎకరాల పొలం.

## రిజిస్టర్ ప్రకారం విద్యార్ధుల సంఖ్య ఎంత?

రామారావు తను పుట్టిన ఊళ్ళో ని స్కూల్ కి ఒక బిల్డింగ్ కట్టించాడు అందులో ఆ స్కూల్ వాళ్ళు 6 7 8 తరగతులు నడుపుతున్నారు. రామారావు ప్రతీ సంవత్సరం తను కట్టించిన బిల్డింగ్ లోని ప్రతీ విద్యార్ధి కి ఎన్నో క్లాసు చదివితే అన్ని నోట్ బుక్స్ వాటితో పాటు ఒక పెన్ ఉచితం గా ఇచ్చే అలవాటు. ఆ రోజు 6 తరగతి లో ఇద్దరు ఎబ్సెంట్,7 తరగతి లో ముగ్గురు ఎబ్సెంట్, 8 తరగతి లో ఒకరు ఎబ్సెంట్, అందువలన 777 బుక్స్ 111 పెన్నులు ఇచ్చారు. అయితే అటెన్ డెన్స్ రిజిస్టర్ ప్రకారం విద్యార్ధుల సంఖ్య ఎంత?

రిజిస్టర్ ప్రకారం విద్యార్ధుల సంఖ్య విద్యార్ధుల సంఖ్య 6 లో 39, 7 లో 40, 8 లో 38 = 117

జవాబు: ఆ రోజున 6,7,8 తరగతి కి 37 చొప్పున వచ్చారు.

## మొత్తం ఎన్ని నోట్లు వున్నాయి?

అప్పారావు జేబులో 592 రూపాయలు వున్నాయి, అందులో సమన సంఖ్యలో ఒకటి, ఐదు, పది, రూపాయల నోట్లు ఉన్నాయి, అయితే అతని దగ్గర మొత్తం ఎన్ని నోట్లు వున్నాయి?

చామర్తి పజిల్స్

చామర్తి వెంకట రామ కృష్ణ
-201 మర్కజ్ మర్యాద అపార్ట్మెంట్స్
అడిక్మెట్, హైదరాబాద్ 500044

జవాబు: 111మొత్తం నోట్లు (37 3)

## 25 షర్ట్సు 11 జీన్స్ పాంట్స్‌కు ఖరీదు ఎంత?

10 షర్ట్సు ఖరీదు 4 జీన్స్ పాంట్స్ కు సమానం 18 షర్ట్సు 9 జీన్స్ పాంట్స్ కు మొత్తం ఖరీదు 16200 రూపాయలు అయితే 25 షర్ట్సు 11 జీన్స్ పాంట్స్ కు ఖరీదు ఎంత?

చామర్తి పజిల్స్

చామర్తి వెంకట రామ కృష్ణ
-201 మర్కజ్ మర్యాద అపార్ట్మెంట్స్
అడిక్మెట్, హైదరాబాద్ 500044

జవాబు: 25 షర్ట్సు 11జీన్స్ పాంట్స్ ఖరీదు 21000 రూపాయలు ( 25400+100011)



ప్రతిభ, ప్రావీణ్యం, మేధస్సు అనేవి ఎప్పటికయినా బయటపడితీరుతాయి. -సిమర్స్

# సూర్య బుడత




# పంచతంత్ర

## పందెం

ఒక రాజ్యంలో ఇద్దరు సామంత రాజుల మధ్య సరిహద్దు తగాదాలుండేవి. ఆ సరిహద్దు ప్రాంత వాసులు ఎవరికి పన్నులు కట్టాలో తెలీక కట్టడం మానేశారు. ఆదాయం తగ్గిపోవడంతో సామంతరాజులు ఇద్దరూ మహారాజుని ఆశ్రయించారు. ఇలాంటి చిన్న చిన్న తగాదాలు నా దాకు తీసుకురాకండి, మీరే సామరస్యంగా పరిష్కరించుకోండి అని మహారాజుగారు తేల్చేశారు.

పెద్దల సహకారంలో ఇద్దరు సామంత రాజులు ఒక అంగీకారానికి వచ్చేరు.

ఇరువైపు రాజ్యాలనుంచి ఇద్దరు బలశాలురు కోడి కూతతో బయలుదేరి సూర్యాస్తమం దాక ఎంత దూరం పరిగెడతారో అంత ప్రాంతం వాళ్ళది అని నిర్ణయించుకున్నారు. మంచి రోజు నిర్ధారించుకున్నారు. రెండు రాజ్యాల వళ్ళూ తమ తమ బలశాలులని యెంచుకున్నారు.

పందెం ముందు రాత్ర ఒక రాజ్యం వారు రహస్యంగా రెండొవ రాజ్యం కోడిని బాగా మేపేరు. తిని, తినీ ఆ కోడి బద్దకంతో బాగా నిద్రపోయి పొద్దున్న లేవలేదు, కూత పెట్టలేదు. ఆ రాజ్యం వాళ్ళు నిద్రలేచి, కోడిని లేపి, కూత పెట్టించే లోపు వేరే రాజ్యం బలశాలి చాలా దూరం వచ్చేసాడు. పొరుగు రాజ్యం పొలిమేరల దాక పరిగెట్టాడు.

అతన్ని బ్రతిమాలుకుంటే, నన్ను ఎత్తుకుని ఎంత దూరం పరిగెడితే ఆ ప్రాంతం నీకే అన్నాడు. ఈ రాజ్యం బలశాలి అతన్ని ఎత్తుకుని నడవడం మొదలెత్తాడు కానీ ఎంతో దూరం వెళ్ళకుండానే తెల్లారిపోయింది.

రెండు రాజ్యాల మధ్యలో గొడవ మొదలయ్యింది. విషయం తెలిసిన పెద్దలు పందెం రద్దు చేసారు.

ఆ ప్రాంతం ఎవరిదో ఇప్పతికి తేలలేదు. ఆ ప్రదేశాన్ని ఇప్పటికీ పందెం పాలెం అంటారు.



## పద్యాలు

ఆత్మ శుద్ధిలేని యాచార మదియేల
భాండ సుద్దిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా
విశ్వదాభి రామ వినుర వేమ

**భావం –** మనసు నిర్మలంగా లేకుండా దుర్బుద్ధితో చేసే ఆచారం ఎందుకు ? వంట పాత్ర శుభ్రంగా లేని వంట ఎందుకు ? అపనమ్మకంతో దురాలోచనతో చేసే శివ పూజ ఎందుకు ? (ఇవన్నీ వ్యర్థ అని వేమన భావన)

## దారిని చూపండి



## తేడాలు గుర్తించండి






## రంగులు వేయండి

పిల్లలూ ఈ బొమ్మకు చక్కటి రంగులు వేసి రూపును తీసుకురండి





ఒక పవిత్ర ప్రదేశంలో స్వచ్ఛంగా, తెల్లగా వెలిగే జ్యోతిలాంటిదే వయసు మళ్ళినవారి మొహంలో కనిపించే సౌందర్యం. -జోసెఫ్ కాంప్‌బెల్

# కోరికలు తగ్గుతున్నాయి

వాత్సాయన



☐ కోరికలు తగ్గటం యువతరంలో ఎక్కువగా ఉంది. వివాహితులనైనా, అవివాహితులనైనా ఈ సమస్య వెంటాడుతోంది.

☐ సాఫ్ట్‌వేర్ సంస్థల్లో పనిచేసేవారికి పని గంటలు ఎక్కువ కావడం. నిత్యం కంప్యూటర్లముందు ఉండటంవల్ల సైబర్ సెక్స్‌కి అలవాటు పడటం. చాటింగ్ ఎక్కువ కావడం. పోర్నోగ్రఫీ పట్ల ఆసక్తి పెరగడం వల్ల సహజ లైంగిక క్రియ పట్ల ఆసక్తి తగ్గుతుంది.

☐ బిపి, షుగరు వ్యాధులవల్లకూడా లైంగిక ఆసక్తి తగ్గుతుంది.

☐ మానసికదిగులు, ఆర్థిక సమస్యలు, స్ట్రెస్ వల్ల కూడా సెక్స్ పట్ల ఆసక్తి తగ్గుతుంది.

☐ పెళ్లయి రెండుమూడేళ్లయినా సెక్స్‌లో పాల్గొనని పురుషుల సంఖ్య అధికంగా ఉంది.

☐ ఇష్టం లేని పెళ్లిళ్ల వల్ల కూడా కోరికలు కలగవు

☐ అంగస్తంభన సమస్యలు ఉన్న పురుషులు తమ సమస్యను బయటకు చెప్పక పోవడం, డాక్టర్లను సంప్రదించక పోవడంవల్ల కూడా సమస్యలు పెరుగుతున్నాయి.

☐ పెరుగుతున్న కాలుష్యం కూడా పురుషుల సామర్థ్యంపై ప్రభావం చూపుతుంది.

☐ ఇంటర్‌నెట్ చాటింగ్, సెల్‌ఫోన్‌లు కూడా భార్య, భర్తల మధ్య దూరాన్ని పెంచుతున్నాయి.

☐ ఎన్ని పనులున్నప్పటికీ కనీసం రోజుకు ఆరు గంటలు నిద్రపోవాలి.

☐ రోజుకు ఓ గంట వ్యాయామం చేయాలి. సిక్స్‌ప్యాక్ లాంటి కఠినమైన వ్యాయామాలు వల్ల సెక్స్‌పట్ల ఆసక్తి తగ్గే అవకాశం ఉంది. అందుకే వాకింగ్, స్విమ్మింగ్, షటిల్ వంటి వ్యాయామాలు మంచివి. మొక్కుబడిగా కాకుండా ఇష్టంగా చేయాలి. ధ్యానం కూడా మీ లైంగిక శక్తిని పెంచుతుంది.

☐ శృంగారంలో ఆసక్తిని పెంచడానికి ఆహారం కూడా ప్రాముఖ్యత వహిస్తుంది. ఒకప్పుడు మాంసాహారం సెక్స్ కోరికలను పెంచుతుందని నమ్మేవారు. పెళ్లయిన కొత్త దంపతులతో నేతితో చేసిన మినప సున్నుండలు తినిపించేవారు. వాటిలోని పోషక విలువలు లైంగిక పటుత్వాన్ని పెంచుతాయి. ఊరపిచ్చుకలు, చేపలు ఉడుం మాంసం లైంగిక శక్తిని పెంచుతాయని చెరకుడు తన చెరక సంహితలో చెప్పాడు.

ఇప్పుడు మారిన జీవన శైలికి అనువుగా వైద్యనిపుణులు దానిమ్మ పండ్లు, ఆక్రోట్ , ఓట్స్ శక్తినిస్తాయని చెబుతున్నారు. అలాగే మసాలాలు ఘాటుగా ఉన్న ఆహారం తీసుకుంటే కూడా కోరిక కలుగుతుంది. చాక్లెట్లు తినడం వల్ల కూడా లైంగిక శక్తి పెరుగుతుందని ఇటీవల పరిశోధనలో తేలింది. వాటిల్లో మానసిక ఉత్తేజాన్ని కలిగించే ఫినైల్ ఇథైనమైన్ అనే రసాయన పదార్థం ఉంది.

☐ సన్నిహిత మిత్రులతో ఉల్లాసంగా గడపాలి. ఒకప్పటి ఉమ్మడి కుటుంబాలు ఇప్పుడు లేకపోవడంతో ఒంటరితనం పెరుగుతోంది. అందుకే వారానికి ఓసారైనా పార్కులకు, రెస్టారెంట్‌లకు వెళ్లి మిత్రులతో ఉల్లాసంగా గడపాలి. మానసిక భయాలకు దూరంగా ఉండాలి. సానుకూల దృక్పథం అలవర్చుకోవాలి.

☐ భార్యాభర్తల మధ్య లేని పోని అనుమానాలకు తావు లేకుండా చూసుకోవాలి. అనుమానాల వల్ల మానసిక ఆందోళనకు గురై లైంగిక ఆసక్తి తగ్గుతుంది. మనసు విప్పి మాట్లాడుకోవడం వల్ల జీవితం సుఖమయమవుతుంది.

☐ సంపూర్ణ సెక్స్‌కి బెస్ట్ టానిక్‌స్త్రీ. ఆమె సహకారం ఉంటే ఆనందపు అంచులను చూడవచ్చు. స్త్రీ,పురుషుల్లో రసికత ఉంటే జీవితం ఆనందమయమవుతుంది.

☐ మోతాదు మించని మద్యం వల్ల సెక్స్ భయాలు పోయి హాయిగా సెక్స్‌లో పాల్గొనవచ్చు. 60 ఎంఎల్‌వరకు డ్రింక్ చేయవచ్చు. దానికి మించి తీసుకుంటే ఆసక్తి తగ్గుతుంది. భార్యాభర్తలు కలిసి తాగడం ఏమాత్రం మంచిది కాదు.

☐ రోజూ ఒకే చోట కాకుండా వెరైటీ కోసం వివిధ ప్రదేశాల్లో సెక్స్‌లో పాల్గొంటే ఆసక్తి పెరుగుతుంది. బాత్ రూమ్‌లు, సోఫాలు, స్విమ్మింగ్ పూల్స్‌లో కూడా భాగస్వామి ఇష్టంతో పాల్గొనాలి. ప్రదేశం మారడం వల్ల కొత్త అనుభూతులు కలుగుతాయి.

☐ సెక్స్ సమస్యలకు అసలు కారణం అక్రమ సంబంధాలు. వీటివల్ల వీర్యస్ఖలనం,అంగస్తంబన ఏర్పడుతుంది. మానవసంబంధాలు, సామాజిక విలువలు దెబ్బతింటాయి. వివాహేతర సంబంధాలకు దూరంగా ఉండటం

# వాస్తు విజ్ఞానం

తూర్పు-పడమర

శయనం

శయనం విభాగంలో మంచాలు, కుర్చీలు, సింహాస నాలు, గృహోపకరణం కోసం వినియోగించే పరికరాల గురించి చెప్పవచ్చు. వీటిని ఒక క్రమ పద్ధతిలో తయారు చేసే విధానం శిల్పశాస్త్రంలో చెప్పడం జరిగింది. పూర్వం తయారు చేసిన సింహాసనాలు ఎంతో పేరు పొందాయి. విక్రమార్కుని 32 మెట్లతో తయారు చేసిన సింహాసనం చరిత్రలో ప్రసిద్ధికెక్కింది. మొగలుల కాలంలో విదేశాలకు తరలించబడిన నెమలి సింహాసనం కూడా చాలా ప్రసిద్ధి చెందింది. సభా భవనాల్లో ఏయే ఆసనాలు ఏయే ప్రమాణాల్లో ఎక్కడెక్కడ నిర్మించాలి అనే విధానంలో సభా ప్రాంగణాన్ని నిర్మించేవారు. కనుకనే ఉచితాసనం స్వీకరించండి అనే మాట వచ్చింది. ఇక్కడ ఉచిత అంటే తగిన అని అర్థం. హంస తూలిక తల్పాలు, సాధారణ శయ్యలు, దాంపత్యం కోసం నిర్మించే శయ్యలు, అతిధుల కోసం నిర్మించే శయ్యలు ఇలా పలు రకాల శయ్యలున్నాయి.




వేశ్య గృహాల్లోని శయ్యలు, సాధారణ శయ్యలకు కూడా తేడా చెప్పడం జరిగింది. వృత్తి, ప్రవృత్తిలను బట్టి ఏయే ఆసనాలను ఏయే దిక్కుల్లో నిర్మించాలో శిల్ప గ్రంథాలు, సంహిత గ్రంథాల్లో వివరించారు.

సభాభవనం ఎలా నిర్మించాలి, దానిలో ఆసనాదులు, శయ్యాదులు ఎలా నిర్మించాలి అనే దానికి మయసభా భవనం ఒక ఉదాహరణ. శత్రుదుర్భేద్యమైన సభా భవన రచన చేసిన మయుడు శ్లాఘనీయుడు. ఈ మయ సభా భవనం ఎలా నిర్మించారో సంస్కృత భారతంలో చెప్పడం జరిగింది. ఇంద్ర వరుణాది అష్ట దిక్పాలక సభా భవనాలు నిర్మించిన తర్వాత వాటిలోని మిగిలిన వస్తు సామాగ్రి తెచ్చి ఈ మయ సభను నిర్మించారు. మిగిలి పోయిన వస్తు సామాగ్రితో చేసిన ఈ మయ సభా భవనమే ఇంత శాస్త్ర పరిజ్ఞానంతో కూడినదైతే, మిగిలిన ఇంద్రాది సభ భవనాలను ఇంకెంతా ఘనంగా నిర్మించారో వింటేనే ఆశ్చర్యం వేస్తుంది.

షోడశ భూలక్షణం

గృహ నిర్మాణానికి తగిన స్థలాన్ని తెలుసుకోవడానికి ఆ స్థలం యొక్క ఆకారాలు, వాటి మంచి చెడ్డలు విచారించాలి. వివిధ ఆకారాలనుసరించి వివిధ ఫలితాలుంటాయి. స్థలంలో ప్రవేశించినప్పుడు ప్రవేశించిన వారి మనస్సుకు ఆనందం కలిగితే, ఆ భూమి సర్వసమ్మతమని శాస్త్రం చెబుతోంది. కొన్ని సందర్భాల్లో భూమి దీర్ఘచతురస్రంగా గానీ, చతురస్రంగా గానీ ఉండక పోవచ్చు. సరైన దిక్కు లకు అనుకూలంగా లేకపోవచ్చు. అటువంటి సమయంలో దిక్కూచి అనుసరించి కాకుండా వీధిని అనుసరించి గృహ నిర్మాణం చేయాలి. వివిధ ఆకారాల్లో ఉన్న స్థలాల్లో నిర్మాణాలు చేసినప్పుడు పలు రకాల దోషాలు వస్తాయి. ఈ దోషాలను అపరాజిత పృచ్ఛ, మానసార, మయమత, శిల్పరత్న, విశ్వకర్మ ప్రకాశిక, సమరాంగణ సూత్రధార, సనత్కుమార, విశ్వకర్మ వాస్తు తదితర వాస్తు గ్రంథాల్లో షోడశ భూలక్షణం అనే అధ్యాయంలో తెలిపారు. షోడశ భూములు అనగా 16 రకాల భూములు. అవి: ఆయతం (దీర్ఘచతురస్రం), చతురశ్రం, వృత్తం, భద్రాసనం, చక్రం, విషమ బాహువు, త్రికోణం, శకటా కృతి, దండాకారం, పణవాకారం, మరజాకారం, బృహన్ముఖం, వ్యజనాకారం, కూర్మపృష్ఠం, ధనురాకారం, శూర్పాకారం.

1. ఆయతాకార స్థలం:

తూర్పు పడమర లేదా ఉత్తర దక్షిణ కొలతలు సమంగా ఉండి, మిగిలిన రెండు దిశలు పొడవుగా ఉన్నట్లయితే, అటువంటి భూమిని ఆయతం లేదా దీర్ఘ చతురస్రంగా పలుస్తారు. ఈ స్థలంలో నివశించడం వల్ల సకల కార్యాలు సిద్ధిస్తాయని శాస్త్రం చెబుతోంది. గృహ నిర్మాణ స్థలంలో దక్షిణ ఉత్తరాల కొలతలు పొడవని, తూర్పు పడమరల కొలతలు వెడల్పని శిల్ప రత్నం అనే గ్రంథంలో చెప్పడం జరిగింది.

2. చతురస్రాకార స్థలం:

పొడవు, వెడల్పులు సమంగా ఉండాలి. మూల కొల తలు సమానంగా ఉండాలి. ఇది ధనవృద్ధి నిస్తుంది. నాలుగు దిక్కులు హెచ్చు తగ్గులు లేకుండా సమానమైన కొలతలు కలిగిన స్థలాన్ని చతురస్ర భూమి అంటారు. 'లక్ష్మీ చాంచల్య రహితా చతురస్రే ధనాగమ:'

అనగా చతురస్ర స్థలంలో నివసించు వారి వద్ద లక్ష్మీ స్థిరంగా ఉంటుంది.

'చతురస్రే సమే రాజా' సమరాంగణ సూత్రధారంలో రాజులకు ఉత్తమమని చెప్పడం జరిగింది.

3. వృత్తాకార భూమి

వంకరలు లేకుండా వృత్తాకారంగా ఉన్న భూమి అను కూలమైనది. ఈ గృహంలో నివశించే వారికి జ్ఞానాభివృద్ధి, ధనాభివృద్ధి కలుగుతుంది. దేవాలయాలు, విహార మం దిరాలకు మంచిది. విద్యా సంస్థలకు కూడా మంచిదని కొందరి అభిప్రాయం. ఉపగృహాలు నిర్మించేటప్పుడు ఈ గుండ్రని ఆకారాలతోనే పల్లెల్లో నిర్మించే ఆచారం ఉంది. వీటినే చుట్టిల్లు అని కూడా అంటారు.

వృత్తాకార భూమి నిషేధించబడినట్లుగా కొన్ని గ్రంథాలు చెబుతున్నాయని కొందరి అభిప్రాయం. కాని వృత్తాకార భూమిలో నివశించేవారు ఐశ్వర్యవంతులుగా ఉన్నట్లు కనిపిస్తున్నారు. కావున వృత్తాకార భూమిని దేశకాల భేదాలను అనుసరించి ఈ విషయాన్ని ఆలోచించాల్సిన అవసరం ఉంది.

–సుసర్ల బాబురావు
ఎం.ఏ (ఆస్ట్రాలజీ)



మానవుల స్వేచ్ఛ అనేది, పత్రికా స్వాతంత్ర్యంపైనే ఆధారపడి వుంటుంది. -థామస్ జఫర్‌సన్

## జాతకం

# కన్యారాశి లక్షణాలు

కన్యారాశికి చెందినవారు మంచి స్వభావం కలిగి, ఆ స్వభావం చేత అధికారులను ఆకట్టుకుంటూవుంటా రు. వీరికి మలకోశానికి సంబంధించిన అనారోగ్యం మల బద్ధకం ఉంటుంది. నరాలు దుర్భలంగా వుంటాయి. వీరి కి శుక్రుడు అధికంగా మేలు చేస్తాడు. బుధుడు కూడా అనుకూల ఫలితాలను ఇస్తాడు. వీరికి మేనమామ వలన మేలు చేకూరుతుంది. జ్యోతిష్య, గణిత, కావ్య, నర్తన, వైద్య, శిల్ప విషయాల పట్ల ఆసక్తి కలిగివుంటారు. జ్ఞాపక శక్తి అధికంగా ఉంటుంది. రచనా నైపుణ్యం, పాండిత్యం కలిగివుంటారు. గ్రంథ ప్రచురణ సామర్థ్యం కలిగివుంటారు. వీరికి బహుభాషా జ్ఞానానికి అవకాశమున్నది. వ్రాతయందు, చర్చ ఉండదు. లేదా అతి స్వల్పంగా ఉంటుంది. శ్రమపడి ఆర్జించి 40 సంవత్సరాల ప్రాంతంలో స్థిరపడతారు. వార్ధక్యంలో సుఖ జీవనం ఉంటుంది. స్త్రీ మూలక ధనప్రాప్తి ఉంటుంది. కలతలు కూడా ఉంటాయి.

జన్మప్రదేశాన్ని విడిచి దూరప్రదేశంలో స్థిరపడ తారు. వీరిని బంధువులు, ఇరుగుపొరుగు వారికంటే ఇతరులు, స్నేహితులు అభిమాని స్తారు. కుక్కలు, పశువులు మొదల గువానికి సంబంధించిన ప్రమాధాలుంటాయి. వీరి ప్రథ మ సంతతికి 5 సం॥ల లోపు తీవ్ర అనారోగ్యం కలుగు ను. లేదా గండము దాటును. తరచూ ప్రయాణాలు చేస్తారు.

వీరి మనస్సు మిక్కిలి చురుకుగా పనిచేస్తుంది. ఏ అం శంలో బుద్ధి పెట్టినా... ఒక విశిష్టత గోచ రిస్తుంది. కాని చాలాభాగం శక్తి సుఖజీవనం కొరకు ఖర్చవుతుంది. వీరు మనస్సుకు నచ్చిన పనులు మాత్రమే చేస్తారు. ప్రారంభించిన పనులు వెంటనే పూర్తియైనచో ఇబ్బందిలే దుగాని, వాయిదా పడినచో అవి పూర్తవడం కష్టం. కాల నియయం పాటించుట వీరికి కష్ట మవుతుంది. ఇతరులు ఒకరోజులో చేసే పనిని వీరు ఒక గంటలో చేయగల నేర్పు కలిగివుంటా రు. పని ప్రారంభమైనచో ఆగకుండా కొనసాగి స్తారు. ఏ పనినైనా చేసేటపుడు, చేయకుండడా నికి గల కారణాలను వశీదీకరిస్తారు.

ఆహారం, గృహం, వస్తువులు మొదలగువానిని సక్ర మంగా సమకూర్చుకోవడం వీరి సమ యంలో ఎక్కువ భాగం వినియుక్తమగును. చురుకుదనం ఉన్నప్పటికీ వస్తువులను సర్దు బాటు చేసుకోవడం తెలియదు. అన్నీ యథా విధిగా, లోపం లేకుండా చేయాలనిపిస్తుంది. అనావశ్యక విషయాలపట్ల కూడా అధిక శ్రమ పడతారు. గణితం, పలుభాషలు, పలు విషయములందు ఆసక్తి కలిగివుంటారు. బుద్ధి సూక్ష్మంగా పనిచేయును. ధర్మం, చట్టం పట్ల గౌరవం, భయం ఎక్కువ. తమ కష్టాలను ఆత్మీయులకు వ్యక్తీకరించుట వలన వీరికి సంతృప్తి కలుగును. దీనుల పట్ల స్నేహభావం కలిగి ప్రవర్తిస్తారు. ఏ విషయంలోనైనా ప్రవేశించనంతవరకు అధైర్యముం టుంది కానీ, ప్రవేశించిన తరువాత మిక్కిలి ధైర్యం ప్రదర్శిస్తారు.

లయందు నేర్పు కలిగివుంటారు. విషయాన్ని సంయుక్తికంగా నిరూపిస్తారు. ఇతరులు తమను గౌరవించుట పట్ల ఆసక్తి ఉన్నప్పటికీ... గౌరవిచ కున్నా కూడా పరిగణించరు. మంచి వాక్చా తుర్యం కలిగివుంటారు.

వీరు ఒకదానికొకటి సంబంధం లేని పలు కార్యాలు సాగిస్తారు. అప్పులు చేయడంలో నేర్పు కలిగివుంటారు. అప్పు చేసి ఇల్లు కట్టి అందులో సుఖపడుచూ మెల్లగా అప్పులు తీర్చగలరు. జీవితంలో మార్పులు అధికంగా ఉంటాయి. అజీర్ణం, కడుపునొప్పి, చర్మవ్యా. దులు మొదలగు వానికి అవకాశము కలదు.

వీరికి లలిత కళల పట్ల అభిమానం ఎక్కువ. శాస్త్ర విజ్ఞానం విషయంలో నైపుణ్యం, సారస్వత విషయాల పట్ల సందేహ బుద్ధి అధికంగా ఉం టాయి. ఉదార స్వభావంతో ఇతరులకు ఉపకరి స్తారు. విశిష్టమైన ఘనకార్యాలను సాధించ గలిగే సత్తా కలిగివుంటారు. నడకలో వేగం కలిగి వుంటారు. వీరు ఉన్న వయస్సుకంటే తక్కువగా కనిపిస్తారు. వీరు నమ్మిన పనిచేసేటప్పుడు ఇతరుల కష్టనష్టాలను గుర్తించరు. సుఖ జీవనం పట్ల ఆసక్తి ఉన్నా... ఆదర్శం కొరకు పాటుపడ తారు. చాలామంది స్నేహితుల ను కలిగివుంటా రు. ఎట్టి దుస్సాధ్యమైన కార్యాన్నైనా నేర్పుతో సాధిస్తారు.

మోసమన్న వీరికి గిట్టదు. మిత్రుల పట్ల ప్రేమ ఎక్కువ. ఇతరుల పట్ల జాలి కూడా ఎక్కువే. వీరికి కోపం గాని, ప్రేమ గాని ఎక్కువ స్థాయిలో ఉంటాయి... కానీ, ఎక్కువ కాలం ఉండవు. సహజ నియమా లను అను సరించి ప్రవ ర్తిస్తారు. విన యం అధికంగా ఉంటుంది. చొరవ అధికమే గాని, ప్రారం భం లో బిడియం ఉంటుంది. ఇష్టమున్న విషయాలను కూడా ఇష్టం లేనట్లు వాదిస్తారు. నటనా నైపు ణ్యం, అనుకరణం, హాస్య కౌశలం అధి కంగా ఉంటాయి. వీరికి ఉన్న సామర్థ్య ముకంటే అధికమైన గుర్తింపు పొంద గలరు. చిన్నతనమున ఆరోగ్య లోపానికి అవకాశమున్నది. వీరికి పిత్రార్జితం

మీ సందేహాలని క్లుప్తంగా (మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ..................................

పుట్టిన తేదీ : ..................................

పుట్టిన సమయం : ............................

పుట్టిన ఊరు (మండలం) : ..................

ప్రశ్న : ..................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం

SPR publications, Surya Soudha, Plot.No: 185, M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar, AyyappaSociety Opp: Hi-Tech City, Hyderabad - 500 072.

## 25-9-2016 నుండి 1-10-2016 రాశిఫలం



**మేషం: Aries** (అశ్విని, భరణి, కృత్తిక - 1) వారంప్రథమార్ధంలో మత, సేవా కార్యక్రమా లకు, వైద్యసలహాలు, చికిత్సకు ఖర్చు ఉంటుంది. పరిశోధనలు, అధ్యయనాలకు అనుకూలం. వృత్తి వ్యాపా రాలలో లాభం. నూతన ఉద్యోగావకాశాలు, రుణ యత్నాలు ఫలిస్తాయి. విలువైన వస్తువుల కొనుగో లు, రావలసిన మొత్తాల అందుబాటు. ఒక ఆహ్వానం, శుభ వర్తమానం . ఇంటర్వ్యూలో విఫలం, కోర్టు వివాదాలలో అపజయం.



**వృషభం: Taurus** (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2):వారం ప్రథమార్ధంలో సాంఘిక కార్యక్రమాలలో ఆసక్తి. యూనియన్లు, సంఘాలు, ప్రభుత్వపు పనులలో సానుకూలత. ఉన్నత విద్యావ కాశాలు, వైజ్ఞానిక కార్యక్రమాలలో సత్ఫలితాలు. కాంట్రాక్టులు, భాగస్వామ్య ఒప్పందాలకు అనుకూ లత. వ్యక్తిగత అభివృద్ధి, వివాహయత్నాలు, కొత్త స్నేహాలు. స్పెక్యులేషన్లలో నష్టం, ఆస్తి వివాదాలు, రుణదాతలు, సంసల ఒత్తిడి.



**మిథునం: Gemini** (మృగశిర -3,4 ,3,4, ఆరుద్ర, పునర్వసు–1,2,3)వారారంభంలో రాజ కీయాలలో రాణింపు, ఉద్యో వృత్తి వ్యాపారాలలో ఊహించని శుభ పరిణామం. మత ధార్మిక సంస్థలలో కీలక బాధ్యతలు. యోగ ధ్యాన సాధనలతో ఆరోగ్యం మెరుగుదల. టీవి, సినియా కార్య క్రమాలతో ఆసక్తి. బంధుమిత్రుల సమాగమం. వివాహయత్నాలు, కాంట్రా క్టులు, ప్రకటనలకు అనుకూలం. వ్యాపార పెటు బడులకు రుణ సేకరణ.



**కర్కాటకం: Cancer**(పునర్వసు -4,వారారంభంలో దూరపు వ్యక్తులు, సంస్థలతో పరిచ యాలు, దూర ప్రాంత సమావేశాలకు హాజరు. కళా సాంస్కృతిక కార్యక్రమాలు, క్రీడలు, పందేలు వంటి పోటీలలో ఆసక్తి. పిల్లల ప్రతిభా పాటవాలకు గుర్తింపు. అభిమానులు, అనుచరుల పెరుగు దల. విశ్రాంతి లేకపోవడంతో అలసట. సహోద్యోగులు, సహకార్మికులతో విభేదాలు. సోదరీసోదరులలో, బంధువు లలో ఒకరికి అనారోగ్యం. ఇంటర్వ్యూలలో నిరాశ.



**సింహం: Leo** (మఖ, పుబ్బ, ఉత్తర -1): వారారంభంలో ఏజెన్సీ కమీషన్ వ్యాపారాలు, షేర్లు డిపా జిట్లలో లాభాలు. రావలసిన రుణాల వసూలు. స్వయం ఉపాధి లేక ఉద్యోగావకాశం. స్థిర చరాస్తి వ్యవ హారాలలో లాభం. వారసత్వంగా ఆస్తుల సంక్రమణ. ప్రేమలో విజయం, కళలు క్రీడల్లో రాణింపు. పిల్ల లు ప్రియతములలో శుభ పరిణామాలు. వారం మధ్యలో వినోద విహారాలకు అధిక వ్యయం. స్పెక్యులే షన్లలో నష్టం.



**కన్య: Virgo** ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2):వారారంభంలో ప్రియతములతో వినోద, విహార యాత్రా కాలక్షేపాలు. దూరపు వ్యక్తులతో పరిచయాలు. శుభ వర్తమానం, పరీక్షల్లో ఉత్తీర్ణత, ఉన్నత విద్యాభ్యాసం. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత, ఆలయాల సందర్శన. నిర్మాణ పనులు, కళా సాంస్కృతిక కార్యక్రమాల పట్ల ఆసక్తి. ఇతర క్రీడల్లో రాణింపు. వారం మధ్యలో స్థాన చలనం. వృత్తి విరోధులతో ఇబ్బంది. వ్యక్తిగత విషయాలకు, వృత్తి బాధ్యతలకు ఘర్షణ.



**తుల: Libra** (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3) వారారంభంలో కృషి రంగంలో ప్రోత్సాహం, స్వయం ఉపాధి పథకాలకు నిధుల మంజూరు. రావలసిన మొత్తాల అందుబాటు. కంపెనీ వాటాల కొను గోలు. స్థిర చరాస్తి వ్యవహారంలో లాభం, వైద్య ఆరోగ్య అవసరాలకు ఖర్చు. ఇంటి పనుల పట్ల ఆసక్తి, ఇంట్లోజరిగే శుభకార్యం కోసం ఏర్పాట్లు. ప్రయాణాల వల్ల అలసట, అనారోగ్యం.



**వృశ్చికం: Scorpio** (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ)అనూరాధ, జ్యేష్ఠ)వారారంభంలో కొత్త పరిచ యాలు, ప్రేమ వివాహాలు కుటుంబానికి సంబంధించి శుభ పరిణామాలు, వారితో వినోదాలు కాలక్షేపాలు. కళా సాంస్కృతిక కార్యక్రమాల పట్ల ఆసక్తి, క్రీడల్లో రాణింపు. బంధుమిత్రుల సమాగమం, సంతానాభి వృద్ధి. వ్యాపార ఒప్పందాలకు అనుకూలత, నూతన ఉద్యోగావకాశాలు. అనవసర వ్యయం, పిల్లలతో ఇబ్బంది, రుణదాతల ఒత్తిడి.



**ధనుస్సు: Sagittarius** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ -1): వారారంభంలో ఇంటి పనులపట్ల ఆసక్తి. స్వయం ఉపాధికి ప్రోత్సాహం. అదనపు ఆదాయ మార్గాలు. ఉద్యోగులకు ఇంక్రి మెంట్, బోనస్ లభించే అవకాశం, వైద్య ఆరోగ్య అవసరాలకు ఖర్చు. ఇంట్లో పూజలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలు. తల్లి ఆరోగ్యం మెరుగుపడుట, టీవి, సినిమా కార్యక్రమాల పట్లఆసక్తి. వారంమధ్యలో విధుల నిర్వాహణలో అజాగ్రత్త. వ్యక్తిగత విషయాలకు, వృత్తి బాధ్యతలకు ఘర్షణ .



**మకరం: Capricorn** (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ఠ -1,2):వారారంభంలో ఇరుగు పొరుగు, బంధువులు, పిల్లలు, ప్రియతములతో సంభాషణ. వినోద కాలక్షేపం. సృజనాత్మక ప్రతిభకు గుర్తింపు. క్రీ డలు సాంస్కృతి కార్యక్రమాలలో ఆసక్తి. పరీక్ష ఇతర పోటీలలో విజయం. సభలు సమావే శాల పట్ల ఆసక్తి. అభిమానులు అనుచరుల పెరుగుదల. చర్చలు, ఒప్పందాలు ఫలప్రదం. వారం మధ్య లో కోర్టు వ్యవహారాల వల్ల ఇబ్బంది.



**కుంభం: Aquarius** (ధనిష్ఠ-3,4, శతభిష, పూర్వాభాద్ర- 1,2,3 వారారంభంలో గృహవసర వస్తువులు , ఇంటి పనుల కోసం ఖర్చు, ఇళ్ళ విక్రయాలలో లాభం,గృహనిర్మాణానికి నిధుల లభ్యత. పరోపకారం ఇంట్లో ఒకరికి ఆశ్రయం, ఒకరికి అనారోగ్యం. నూతన ఉద్యోగావకాశం. హోదా గౌరవం పెరుగుదల, తండ్రికి శుభం. పరిశోధనలు అధ్యయనాలకు ఖర్చు. వారం మధ్యలో షేర్లు , పెట్టుబడులలో నష్టం, రుణదాతలు , సంస్థలఒత్తిడి , ఆస్తి వివాదాలు, పిల్లల వల్ల అనవ సర ఖర్చు.



**మీనం: Pisces** (పూర్వాభాద్ర -4, వారారంభంలో పర్యటన, శుభ వర్తమానం, సోదరీ సోద రుల కలయిక. సంప్రదింపులు, చర్చలు, అగ్రిమెంట్లు, యూనియన్లు, సహకార సంఘాలు, రాజకీయ పార్టీలలో చేరిక, వాటిలో కీలక పాత్ర. ప్రభుత్వంతో పనుల సాఫల్యం. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత. ఉన్నత విద్యా వకాశాలు, వైజ్ఞానిక కార్యక్రమాలలో సత్ఫలితాలు, పెద్దలు ప్రముఖులతో పరిచయం. వారంమధ్యలో వృత్తిలో విరో ధుల వల్ల ఇబ్బంది.



న్యాయాన్ని, ధర్మాన్ని, సుఖ సంతోషాలను ఆఖరికి మనిషిలోని దైవత్వాన్ని కూడా యుద్ధం చంపివేస్తుంది. -చార్లెస్ సైనర్

## ఆలయం

హిందూమత సాహిత్యం ప్రకారం, చిదంబరం అనేది శివుని ఐదు పవిత్రమైన ఆలయాల్లో ఒకటి. పంచ భూతాలకి ఒక్కొక్క ఆలయం నిర్మించబడం ది. చిదంబరం ఆకాశతత్వానికీ,తిరువనైకవల్ జంబుకేశ్వర జలతత్వానికీ, కంచి ఏకాంబరేశ్వర భూమితత్వానికీ, తిరువణ్ణామలై అరుణాచలేశ్వర అగ్నితత్వానికీ మరియు కాళహస్తీశ్వర స్వామి వాయుతత్వానికీ నిదర్శనాలు.

ఈ ఆలయాల సముదాయం నగరం నడిబొడ్డున వ్యాపిం చి ఉంది. శైవుల మరియు వైష్ణవుల దేవతలు కొలువున్న అతికొద్ది దేవాలయాల్లో ఈ ఆలయం

భారతదేశంలోని దక్షిణ రాష్ట్రమైన తమిళనాడు మధ్యస్థ తూర్పు భాగంలోని, కడలూర్ జిల్లాలోని కారైకల్కు ఉత్తరంగా 60 కిలోమీటర్ల దూరంలో, పాండిచ్చేరికి దక్షిణంగా 78 కిలో మీటర్ల దూరంలో ఉన్న ఆలయ నగరమైన చిదంబరం నడిబొడ్డున ఈ ఆలయం నెలకొని ఉంది. తమిళ సంగం సాహిత్య రచనల ప్రకారం, సనాతన విశ్వకర్మల వంశస్థుడైన విదువేల్విడుగు పెరుమ్తకన్, ఈ ఆలయం వునః సృష్టికి ప్రధానరూపశిల్పి.



# మోక్షాన్ని ప్రసాదించే నటరాజస్వామి

ఒకటి. నటరాజు అయిన శివుడుకి, గోవిందరాజ పెరుమాళ్ళుకి అంకితమైన ప్రాచీన మరియు చారిత్రాత్మక దేవాలయం ఇది. ఏ విధంగా కోవెల (గుడి) అంటే వైష్ణవులకు, శ్రీరంగం లేదా తిరువరంగం స్మరణకి వస్తుందో అదే విధంగా శైవులకి చిదంబర ఆలయమే స్మరణకి వస్తుంది.



### గోపురం మీద చిక్కని శిల్పకళ.

చిదంబరం అను పదం, చైతన్యం అని అర్థం వచ్చిన చిత్, ఆకాశం(ఆకాయం నుంచి పుట్టిన) అని అర్థం వచ్చిన అంబ రం, సూచించిన చిదాకశం, చైతన్యం ఆరోపించబడినట్టి ఆకాశం, దీనినే అన్ని వేదాలు మరియు శాసనాల ప్రకారం, మానవుడు చేరుకోవలసిన అంతిమ లక్ష్యంగా చెప్పబడి నది. మరొక సిద్ధాంతం ఏమనగా, ఇది చిత్ + అంబళం నుంచి పుట్టినది. అంబళం అనగా కళలను ప్రదర్శించుట కొరకు ఒక వేదిక. చిదాకశం అనేది పరమేశ్వరుని చిద్విలాసం లేదా ఆనందం నటరాజుని చిద్విలాసం లేదా ఆనంద నటన చిహ్నాత్మక వర్ణన. చిదంబరాన్ని దర్శిస్తే విముక్తి లభిస్తుందని శైవులు నమ్ముతారు. ఇంకా మరొక సిద్ధాంతం ప్రకారం, ఆట లేక దైవ నృత్యం అని అర్థం వచ్చే చితు, వేదిక అని అర్థం వచ్చే అంబళం నుంచి వచ్చిన చిత్రాంబళం నుంచి ఈ పదం పుట్టింది.

సర్వాలంకృతభూషితుడైన నటరాజుని చిత్రం, ఈ ఆల యం ప్రత్యేకత. పరమ శివు, భరతనాట్య నృత్యం దైవంగా వర్ణించింది.

శివుడికి శాస్త్రీయ రూపమైన లింగానికి భిన్నంగా మనుష్య రూపాన్ని ఆరోపించిన మూర్తితో శివుడిని నెలకొల్పిన అతికొద్ది దేవాలయాల్లో ఇది ఒకటి. పరమ శివుడు నిలుపునట్టి ఈ విశ్వం యొక్క కదలికలు, నటరాజు యొక్క జగత్సంబంధమైన నృత్యాన్ని పోలి ఉంటుంది. ఆలయంలో ఐదు ఆవరణలు ఉన్నాయి.

అరగాలూరు ఉదయ ఇరరతెవన్ పొంపరప్పినన్ (అలి యాస్ వనకోవరైయన్) 1213లో చిదంబరంలోని శివుని ఆలయాన్ని పునర్నిర్మించాడు. అదే బాణ సామ్రాజ్య ప్రము ఖుడు తిరువన్నమలై ఆలయాన్ని కూడా నిర్మించాడు.

ఈ ఆలయాన్ని సనాతనంగా నడిపిస్తున్న దిక్షితార్ అని పిలువబడే, అంతర్వివాహీకులైన శైవ బ్రాహ్మణులు, అధికారిక పురోహితులు కూడా. దీక్షితార్లకి, తమిళనాడు ప్రభుత్వానికీ మధ్య జరిగిన దీర్ఘకాలిక యుద్ధానికి ఇది చరమాంకం. ప్రభుత్వం దీక్షితార్లు కానివారిని తేవరం స్తోత్రాలను దేవుని యొక్క 'గర్భగుడి'లో (సంస్కృతం: గర్భ గ్రిహ) గానం చేయుటకు అనుమతించినప్పుడు, దీక్షితులు, వారికి మాత్రమే నటరాజుని గర్భగుడిలో పూజించే హక్కు కలదని తెలియజెప్పి అభ్యంతరం చెప్పుటతో మొదలైనది.

# సాధనలో నియమాలు అవసరమా?

**నియమం లేని సాధన వికృత శక్తిని జనింపచేస్తుంది, నియమాలతో కూడుకున్న సాధన మార్గం మనిషిని ఉత్తమస్థితులకు తీసుకువెళుతుంది. ఈ మధ్య కాలంలో ఆధ్యాత్మికతను సులభతరం చేయాలనే ప్రయత్నంలో జనాకర్షణ కోసం గురువులుగా చెప్పుకొనే కొందరు ఎటువంటి నియమనిబంధనలు లేని కొన్ని ఆధ్యాత్మిక విధానాలను ప్రవేశపెడుతున్నారు. అవి ఎంత సులభతరమో వాటి ఫలితాలు కూడా అంత ప్రమాదకరంగా మారే అవకాశం వుంది.**

సాధనా మార్గం సులభతరంగా వుండటం తప్పులేదు, కానీ సాధకుని భావజాలం కూడా సులభతరం వైపే మొగ్గుచూపితే కష్టించి పనిచేసి సంపాదించకుండా దొంగదారిలో సంపాదించాలనే వాడి బుద్దిలా మారిపోతుంది. సాధనతో వచ్చే శక్తితో పాటు వ్యక్తి యొక్క నిర్మాణం కూడా జరగాల్సి వుంటుంది. వ్యక్తిగా ఉన్నతమైన భావజాలము ఆచరణ లేని సాధన యొక్క శక్తి మనిషిని అయోమయంలో పడేస్తుంది. పూర్వం ఒక గురువుదగ్గర శిష్యుడిగా చేరడానికే ఎన్నో నియమాలు పెట్టేవారు, ఆ నియమాలలో శిష్యుడిగా చేరాలనుకునే వాడు నెగ్గితేనే



శిష్యరికం ఇచ్చేవారు. లేదంటే ఆ కనీస అర్హత వచ్చే వరకు ఆ వ్యక్తి మాళ్ళీ మళ్ళీ ప్రయత్నం చేయాల్సిందే. ఇవన్నీ నాస్తికులకు,కుహనావాదులకు తప్పులుగా తోచవచ్చు కానీ అవన్నీ లేకపోతే సమాజం ప్రమాదాల వడిలోకి పోవాల్సివస్తుంది. టెక్నాలజీ అనేది దేశ ప్రగతికి దోహదపడుతుందటే, మరో పక్కన అదే టెక్నాలజీ ఉగ్రవాదులకు విధ్వంస కాండ కోసం ఉపయోగపడుతోంది. సాధన చేస్తే ఎవరి కైనా శక్తి ఉత్పన్నమవుతుంది, కానీ ఆ సాధన చేసిన వాడి వ్యక్తిత్వ నిర్మాణము సరిగా లేకపోతే అది రాక్ష సత్వంగా,వ్యక్తిగా ఉన్నతంగా వున్నవాడి సాధనా శక్తి దివ్యంగా ప్రవర్తిస్తుంది. అందుకు మంచి ఉదాహరణ రాముడు, రావణాసురుడు. రామాయణంలో చెప్పిన ప్రకారం రావణాసురుడు తపో సంపన్నుడు. అతని తపస్సువల్ల అనితరసాధ్యమైన ఎన్నో శక్తులు ఆయన సొంతం చేసుకోగలిగాడు. అయితే నేం రాముడి సర్వోన్నతమైన వ్యక్తిత్వం ముందు, ఆ దివ్యత్వం ముందు మోకరిల్లాల్సి వచ్చింది. రావణాసురుడిలో శక్తి వక్రమార్గాలను వెతుకుతుంది, రాముడిలోని శక్తి లోకానికి దారి చూపింది. ఒక సాధన ద్వారా శక్తి జనిస్తుంది అంటే అక్కడ నియమమనేది తప్పనిసరి వుండి తీరాలి, నియమం లేకుండా సాధన చేస్తాము అంటే దాని కోరల్లో ఏదోక రోజు చిక్కుకోవడం ఖాయం. ఈ మధ్యకాలంలో ఎన్నో ఆధ్యాత్మిక సంస్థలు పుట్టుకొచ్చాయి.(జనాల బద్దకాన్ని ఆసరాగా చేసుకుని వారి బద్దకానికి అనుగుణంగా ఆధ్యాత్మిక విధానాలను రూపొందించి, వారికి సాధానా మార్గాలుగా చెబుతున్నారు. అవి బద్దకస్తులకు అనుకూలంగా వుండటంతో వారుకూడా వాటికి ఆకర్షితులై ఆహా ఓహో అంటూ బుట్టలో పడుతున్నారు. వెస్ట్రన్ కల్చర్‌కి అలవాటుపడిన కొందరు వాటిని పరమాద్భుతమైన సాధనలుగా ప్రాచారం చేస్తున్నారు. **అలా నియమాలు లేని**




సాధన మంచే చేస్తుందంటే సకల వాంగ్మయాన్ని అందించిన వేదవ్యాసుడు మనకు చెప్పలేకపో యాడా?. హిందూ ధర్మాన్ని అవహేళన చేస్తూ జనాల్లో అపోహలను సృష్టించి మనవారు కొట్టుకునేలా చేసిన కొన్ని కొత్తమతాలను పారిపోయేలా చేసిన ఆదిశంకరులు చెప్పలేకపోయారా?

*ఒక్కసారి బుద్దిపెట్టి ఆలోచిస్తే సాధనా మార్గంలో నియమాలు ఎంత ముఖ్యమైన పాత్రను పోషిస్తాయో తెలిసివస్తుంది.*

ఆధ్యాత్మిక సాధనకంటే ముందు సాధనలోకి అడుగు పెట్టాలనుకునే వాడికి క్రమశిక్షణ చాలా అవసరం. అది రోజువారి జీవితంలో మనం అలవాటు చేసుకోవాల్సిన విషయం. భోగలాలసత్వంతో సుఖాలవెంట పడి వాటినే ఆధ్యాత్మిక సాధనగా మార్చివేయగల ప్రబుద్ధులు భూమి పైన వున్నారు. సాంప్రదాయకంగా ఉత్తమంగా జీవించే వారిని చూసి అవహేళన చేసే రోజులు వచ్చేసాయి. ఆధ్యాత్మి కతలో కూడా విచ్చలవిడి తనపు సాధనా విధా నాలు పుట్టుకొచ్చాయి. నియమమే లేదనే సాధన వ్యర్థం. సాధకులు గమనించి మార్గాన్ని ఎంచుకోవాలి.

www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు పుస్తకముల పట్టిక

(Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.

Like us to follow :



**MOHAN PUBLICATIONS**

Rajamahendravaram



0883 - 246 2565
903 246 2565

Mohan PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

